







# శ్రీ అనుభవానంద గ్రంథమాల

బాపట్ల-522 101(గుంటూరుజిల్లా) *భీమునిపట్నం-531 163(విశాఖజిల్లా)

మొదటి కుసుమము



ప్రథమ ముద్రణ : 1938

షష్ఠమ ముద్రణము : 1985

ప్రతులకు :

శ్రీ అనుభవానంద గ్రంథమాల

బాపట్ల-52[illegible] (గుంటూరు జిల్లా)

భీమునిపట్నం-5[illegible] (విశాఖ జిల్లా)

ముద్రణ :

శ్రీ ఉషోదయా ఆర్ట్ ప్రింటర్స్

2/14 బ్రాడీపేట, గుంటూరు-2

# ఉపోద్ఘాతము

(షష్ఠమ ముద్రణము)

పాఠకులారా !

ప॥ ప॥ శ్రీ శ్రీ శ్రీ అనుభవానంద స్వాములవారు సర్వమత సాధనానుభవావతార స్వరూపుడగు శ్రీ రామకృష్ణదేవుని అనుయాయులు. శ్రీ స్వామిజీ 193 లో వంగదేశమున పర్యటించుచు, శ్రీ రామకృష్ణుని జన్మభూమియగు కమార్పుకూరు సమీపమున గల కొతుల్పూరుకు వెళ్ళారు, అచ్చట కొలది మంది భక్తులు చేరి 'భజ కాళీ కృష్ణో శివో రాం, రామకృష్ణో ఆత్మారాం' అని చక్కగా భజన గావింపగా, శ్రీ స్వామిజీ విని, ఆనందించి, వెంటనే శ్రీ రామకృష్ణుని జీవితమునంతయు 108 పంక్తులలో నిమిడ్చి 'ధర్మోద్ధారక జగద్గురో శ్రీరామకృష్ణా నమో నమో' అని ఒక కీర్తనను వ్రాసుకున్నారు అక్కడే. తరువాత శ్రీ స్వామిజీ శ్రీ శారదా రామకృష్ణులపై అనేక కీర్తనలు రచించి, 'శ్రీ రామకృష్ణ లీలా సంకీర్తనము' అని పేరు పెట్టి యున్నారు. ఆ 'సంకీర్తనము' మన ప్రథమ కుసుమమై అయిదు పర్యాయములు ముద్రితమైనది.

1963వ సంవత్సరము శ్రీ వివేకానంద స్వామి శతవార్షికోత్సవ సందర్భమున నీ గ్రంథము పంచమ ముద్రణమును పొంది, దేశదేశముల దిరిగి శ్రీ శారదా రామకృష్ణ జీవిత సాధనా విశేషములననేకులకు విశద పరచినది. శ్రీ రామకృష్ణ భక్తులెల్లరు నీ కీర్తనల గానము చేయుచు ఆనందించుచున్నారు.

ఈ 'శ్రీ రామకృష్ణ లీలా సంకీర్తనము' అను దివ్య కీర్తనామృతమును ప్రసాదించినవారును, నాకు గురుపుంగవులును అయిన శ్రీ స్వాములవారు 1973 వైశాఖ శుద్ధ పూర్ణిమనాడు తమ భౌతిక కాయమును వదులుట జరిగినది.

నేటివరకు, అనగా సుమారు 20 వత్సరములు మౌనముగ నుండిన మన యీ 'లీలా సంకీర్తనము' మరల నూతన కీర్తనావళితో, క్రొత్త నామ సంకీర్తనలతో నారవ ముద్రణమును పొంది, శ్రీ శారదా రామకృష్ణుల అనుగ్రహ విశేషమున శ్రీఅనుభవానంద స్వాములవారి ఆశీర్వచన ప్రభావమున బహిర్గతమైనందులకెంతయు ఆనందించుచున్నాను,

ఈ కీర్తనలయందలి భావ మాధుర్యమును గ్రోలి, శ్రీ శారదా రామకృష్ణుల జీవిత ప్రాశస్త్యమును గ్రహించి, భక్తితో గానము చేసి భగవదనుగ్రహమును పొందెదరు గాక !

శ్రీశారదామాయీ జయంతి

భీమునిపట్నము

స్వామి శాంతి

శ్రీ ... శానంద

26-12-1983

# ప్రేమహార్పణము

పరమాధ్యాత్మిక బీజ రాజమును ప్రా
పై నాదు హృత్ క్షేత్రమం
దురు కారుణ్యముతోడ నాటి పరిపూ
ర్ణోద్బోధ బోషించు సత్
చరితాత్ముల్, గురువర్యులున్, విమలహం
సాచార్యులై వెల్గు సిం
గరిదాసాఖ్యుకు, రామకృష్ణునకు నీ
గ్రంథంబు నర్పించెదన్





# విషయసూచిక

* * *

ఓం

# శ్రీ రామకృష్ణాయ నమః

శ్రీరామకృష్ణోద్యాన విహారము చేతము రండీ జనులారా
సర్వపుష్ప ఫల-పత్ర మధూదక సంపద గల్గు వి-శాల వన
మహాహా

1. శాక్తేయంబను-సరసును గనుడీ సర్వతృష్ణ విచ్ఛేదక తీర్థము
రామప్రసాదా-కమలకాంతు లిట అమరులచందం-బాడుచుండిరి

2. కాంచుడు తాంత్రిక-ఘనలత యందము సర్వపాప భయ-హారక
పాశము
భైరవి బ్రాహ్మణి-పరమ భక్తులకు ఆలవాలమిది-విశ్రమ స్థానము

3. రామఫలంబుల-రుచి జూడు డిట కర్మబంధ-నిర్మూలము గనుడీ
మారుతి, శబరి, క-బీరు రామదాసు లరుగో ముక్తులు-లోక
లోకపూజితులు

4. క్రైస్తవవానుభవ-పుష్పరాజ యుత వృక్షరాజమిది-పరిమళ
పూర్ణము
పేతురు,పౌలు-ఫ్రాన్సిసు మొదలగు భక్తుల జూడు డు-న్మత్తత
నుండిరి

5. ఇస్లాముమత-అనుభవసారము అదిగో ధారగ-నిలబడుచున్నది
ఉమ్మర్ఖయామా-ద్యుత్తమ పురుషులు ఓలలాడి పర-మాత్మను
జేరిరి

6. బౌద్ధధర్మ ని-ర్వాణ ఫలంబుల భాసిలు తరువును-చూచితిరా
ఆనందాశోక, నా-గార్జున ప్రముఖుల ఆనందాంబుధి-మగ్నుల
జేసెను

7. అద్వితీయమగు-నద్వైతంబను నిర్వికల్ప ఘన-కల్పక మిదిగో
శంకరాదు లెప్డు సేవింతురు దీని సర్వకోర్కె-లను-దీర్చును
కోరుము

8. ఈ పటరాజము-సేవింపగ జను లెందరో జేరుచు నుండిరో
గాంచుడు
సర్వ మతములకు-సర్వ జాతులకు స్థావరమనుటయు-స్థిరముగదా

9. వచ్చిన వారలు-చూచి పోరుసుమా అచ్చటనే కూ-ర్చుండి
యుండుచు
నిశ్చల వృత్తిని-యిష్ట పదార్థము నందు మునిగి యా-నంద
మొందుదురు

10. వివేకానందుని-అధ్వర్యంబున పెక్కు మహాత్ములు-పాలన సేయుచు
ఒక్కొకచోటున-ఒక్కొరుండుచు చక్కగ మనకు-చెప్ప యిత్తు
రవి

11. సోదరులారా!-సామాన్యమె యిది సరగున రండు-సంతసమొందుడు
కాలయాపన-లేల మనకు నిక అనుభవానందో-ద్యానసీమ యిది

## 2

శ్రీ శారదాదేవి జననీ-నీదు చిద్విలాసము నెట్లు చెపుదు
ఏకంబవై తొలుత-సృష్టిని కల్పింప శక్తివై నీ నాథు-జనియింప
జయవే

1. మూర్తిత్రయము ముందు జేసి-అంత మూడు శక్తులు వారి కొసగి
పుట్టింప, బోషింప-గిట్టింప నీవయై పూర్తిగ నీ జగ-న్నాటక
మాడవే

2. స్రష్ట సృష్టలు నీవె యగుచు-వాని సవరించు శక్తి వీవగుచు
సర్వంబు నీవయై-సాక్షీ మాత్రంబవై సర్వ కల్పన కధి-ష్టానంబవున్
గాదే

3. భ్రాంతి బొందిన జీవుడివే-వాని భ్రాంతి రూపంబును నీవే
భ్రాంతి బాపెడు గురువు-భ్రాంతి దీసెడు పథము భ్రాంతి బాసిన
జ్ఞాని-భ్రాంతిపోగా నీవే

4. అజ్ఞానమన నున్న నిజము- జ్ఞాన మన్న శూన్యము నిజము నిజము
అవ్వి నీయమై-అగోచరంబునై అనుభవానందమై- అందరా
కుందువే

## 3

రావా ! గురుదేవా ! మాధవా !
సర్వసృష్టి స్థితి లయ కారణ సర్వ జగదోద్ధారణ, రమణా
సర్వ సగుణ నిర్గుణ భూషణ, సర్వ కారణా
రాజా మహారాజా రాజా రాజిత వైరాగ్యతేజా
సచ్చిదానంద విలోలా ఈశ్వరా ! శ్రీ రామకృష్ణా !

2. శ్రీ చంద్రా ఖుదిరాము పుత్ర సర్వాధ్యాత్మిక దివ్య చరిత్ర
సర్వ మానన లోక పవిత్ర, సర్వనుతి పాత్ర
నిరుపమ గుణ గణ దివ్యవికాసా
భారతజననీ భాగ్య విశేషా
పరమ పురుషఅవతారవరిష్ఠా హే ప్రభో ! శ్రీ రామకృష్ణా !

3. శ్రీ వివేకానంద విలోలా శారదామణి హృదయలోలా
నిర్వికల్ప సుధారసలోలా, సర్వప్రియలోలా
సర్వభక్త జనపరిపాలా శ్రీ జగద్ధాత్రి కంఠ సుమాలా
సహజ సుజ్ఞానామృతధారా సద్గురో ! శ్రీ రామకృష్ణా !

4. అనుపమానంద స్వరూపా అనయము మది నిన్నే వేడెద
తనయుడ నను జేరదీసి, కనికరింపవే
నీవే గురువు నీవే దైవము నీవే సర్వమటంచు నమ్మితి
అనుభవానందంబు లిమ్ముహరిహరా ! శ్రీ రామకృష్ణా

# 4

శారదా కరుణించి బ్రోవవే కృపతోడ గావవే-లోకైక మాత !

1. దారి తప్పిపోయినాడనే చెడిపోయినాడనే
పారము లేనట్టి నీదు పరమపావన సుఖము వదలి
సారము లేనట్టి ఈ సం సారమందు మునిగిపోతి

2. నిన్ను విడచి దుఃఖమొందితి దుర్వృత్తి నొందితి-నా కన్నతల్లీ !
కన్నులుండి గ్రుడ్డినైతిని ఆపన్నుడనైతిని
చిన్నతనపు బుద్ధిచేత కన్ను మిన్ను గాంచకుండ
నున్న వాడనంచు నెరిగి ఖిన్నుడనై యున్నవాడ

3. ప్రేమమూర్తివంచు నెరిగితి పాదములకు నొరిగితి-ప్రేమావతార !
బాలు నన్ను దరికి జేర్పవే సన్నిధిని నుంపవే
బోధరూపమైన నీవు బోధి జేసి పరమపదము
భావములకు దూరమైన బ్రహ్మపదము నిమ్ము తల్లి

4. మోక్షమునకునర్హు సేయవే పరిశుద్ధు జేయవే-మోక్షప్రదాత!
త్రికరణముల కడిగి పెట్టవే వాని నొకటి వేయవే
నికరమైన సాధనములు ప్రాకటముగ సాధ్యపడగ
నేకదృష్టి గలిగి జ్ఞాన గగనసీమ నిల్పు మమ్మ

5. ఈషణముల బారద్రోలవే మలత్రయము కడుగవే-కాళీస్వరూపీ!
పాశములను కోసిపేయవే నిష్పాపుజేయవే
విషయములను మాపి, నన్ను దోషవర్జితునిగ జేసి
భాషకే యతీతమైన స్వస్వరూప స్థితుల నిమ్ము

6. అనవరతము నిన్ను వేడెద వినతి మనవి జేసెద-ఆనందమాయీ!
అనుపమాన స్థితుల నియ్యవే ఆనందమియ్యవే
అతులిత ప్రభా విశేష అగణితాదిత్య ప్రకాశ
అనుభవానంద విభూష అవ్యయాత్మ పరబ్రహ్మ

## 5

1. గురుదేవా-సముభావా రావా నను బ్రోవ నా త్రోవ శ్రీధవా శ్రీ
శరణనువారల-జేరదీయుటలు సాగరమందిడినావో!
కరుణను విడనాడినావో !పరమ పావన-శ్రీరామకృష్ణా

2. ఆది లేనిదా-నీదు కనికరము అంతమొందుటయు గలదే !
అంత జగతి చెడిపోదే! వింతతత్త్వరూపా విశ్వేశ్వరా

3. గురువని నమ్ముచు-గరముల మోడ్చుచు చరణసేవ జేయగలేదా,

నిరతము ప్రార్థింపగలేదా ! నిరుపమాన యువ-తారవరిష్ఠా

4. పూర్వ జన్మ కృత-కర్మముచే నీ తర్వాతనె పుట్టితినిగదా :
నిర్భాగ్యత వెనుబడితిగదా! నిర్మలరూపా-ఓర్వగజాలా

5. పూచికపల్లను పురుషోత్తముని గ భావనచేతనె చేతువటే!
పూర్వ కర్మ నశియించునటే! సర్వశక్తిమయ-సంస్తవనీయా

6. ఆనయము నిన్గని-అనుపమ భాషణ గణముల మున్గుటదెన్నటికో!
ధన్యుడనౌట యదెన్నటికో! అనుభవానందా-మునిజనవంద్యా

## 6

శ్రీదక్షిణేశ్వరీ-నీదర్శన మహా చిద్రస రూపము-నరగున జూపవే!
నిను గనుటెన్నడో-నీలకంఠేశ్వరి తనయుని మొర విని—దయ
గొనరావే

1. నీ మహిమల నెంచ- నే నెంతవాడను నిరతిశయానంద- నిర్మల తేజా
నిన్ మది గోరెద-నిరత మనంబరో నిశ్చల చిత్తము- నిమ్మ
పరాంబికా

2. అనుభవానంద, వి- హారి శ్రీ శారదా అద్భుత గుణమయి!
ఆనందమాయీ!
ఆదరముంచవే- అమ్మ దయానిధే భేదమభేదము- ప్రీతిగ జేయవే

## 7

1. రక్షించి నను బ్రోవరా- శ్రీరామకృష్ణ రక్షించి నను గావరా
రక్షించి నను బ్రోవు- లోకైక పూజిత ప్రకటితగుణతేజ!
సకలవేద భూజ

2. ఎన్నాళ్ళు వెతికినను- నిర్మలరూపా ఎన్నాళ్ళు తిరిగినను
ఎన్నాళ్ళు జపియింప-నెన్నాళ్ళు ధ్యానింప సున్న యగుటయు
నిజము-నిన్ను గానని జన్మ

3, నీదు యనుగ్రహమునే- నిశ్చలకీర్తి – నీదు కృపా దృష్టినే
నిరతము వేడుచు- నిన్నే మది గోరుచు నిర్మల వృత్తిని-
నడచుచుంటిని గాదే

4. ఆనందకందమవు- జగద్గురు- అఖండ తేజుడవు
అత్యంతశక్తి స- ర్వాతీత విభుడవు అనుభవానందంబు- లడిగితి
నియ్యరా

## 8

శారదామాయీ నీ- కరుణ కురిపింపవే నిరతము ప్రార్థింతునే ॥శా॥

1. భారమగు సంసారమును నీ కరుణలేకను మీరగలనే ?
ధరలో నగణిత భక్త వరులకు తారకమువై చేరదీయవె

2. నేను, నాది, నీవు, నీదను అనుచితంబగు స్వపర భేదము
జనన గారణమైన యజ్ఞత లోన మునిగి దుఃఖినైతిని

3. లింగభేదము కలుగజేసి అంగనాదులె సుఖమనుచును
సంగరహితానంద స్థితుల నెరుంగనేరక చెడితినమ్మా

4. ధనమె శాశ్వత మంచు దలచి దాని బానిసనౌచు బుద్ధి
హీను పగిదిని బద్ధుడనునై కాననైతిని నీదు సన్నిధి

5. సుతుడె ప్రాణమటంచు నెంచి స్వేతరంబగు భేదమును గని
పతితుచందము వెతల బొంది గతుల బాసి పోతినమ్మ

6. లోకమున నే బేరు గాంచగ పైకి సత్పురుషుండు చందము
సకలవిధ నటనంబు సేయుచు వికలతను వంచించుకొంటిని

7. పరసుఖంబుల కాసపడి వ్యాపారువలె సత్కర్మ జేయుచు
నిరతమును నా దృష్టి లాభ పరమ్ము జేసి చెడితినమ్మా

8. ద్వైత్వ దృష్టిని దేవతలను సతము నే బ్రార్థించి కొల్చియు

వీతరాగుడ గాకపోవుట ఆత్మశాంతిని గాంచనైతిని

9. నీవు నేనను భ్రాంతి వదలి భవ లయంబుల ద్రుంచి వైచి
కేవలాత్మను నేనె యనియెడు దివ్యపదమును నిల్పుమమ్మ

10. అనుపమాన జ్ఞానరూపిణి మానసాతీత ప్రకాశిని
అనుభవానంద స్వరూపిణి గుణగణాతీత ప్రభాసిని

## 9

1. నిన్నే నమ్మితిరా– గోవిందా– నిన్నే కోరితిరా
నిన్నే నమ్మితిని నిన్నే కోరితి నీవే దిక్కని– నిశ్చయమొందితి

2. రాముడనీవేరా– పరికింపగ గృష్ణుడవీవేరా
తమమును జీల్పగ రామకృష్ణుడవై మమ్ము బ్రోవ జన్మమ్ము
నొందితివి

3. అఖిలాత్ముండవురా–సత్యమ్ముగ అమల తేజుడవురా
అఖిల జగత్తును–ఆవరించుకొని అనుపమ లీలల–నాడుచుంటివహా

4. అనుభవనీయుడవు–పరబ్రహ్మానందమువీవు
తనయుడనగు నన్నునయము గాచుచు ననుభవానందము–లొనరగ
నియ్యవే

## 10

**అమ్మ శారద దేవి–ఆనందమాయీ**
**అఖిలలోక ధరిత్రి–అనుపమ పవిత్రీ** ॥అ॥

1. హృదయపీఠముపైన–ముదముతో నుంపగా ఆనంద బాష్పముల–
నభిషిక్తు సేయగా
సర్వార్పణంబుగా–సాష్టాంగమీయగా స్వాగతము నీకిదే
శ్రీశారదామాయి

2. నీ ప్రేమరసములే-నిఖల తృష్ణ నడంచు
నీ కరుణవర్షమే- భక్తిని ప్రసాదించు
నీ ప్రాపు నుండుటే—నిజము మోక్ష పదమ్మ
స్వాగతము నీకిదే—శ్రీ శారదామాయి

3. నిగమ శాస్త్రములెల్ల—నినుగూర్చి చాటించు
ముని గణమెల్ల నిను సతతము కీర్తించు
నిను బోలగా నెవరు—అనుభవానందిని
స్వాగతము నీకిదే—శ్రీశారదామాయీ

## 11

గురుదేవా నీ చరణమె—మది గోరెద నిను వేడెద
కనికరము జూపి నన్ను గావుము శ్రీ రామకృష్ణ

1. త్రికరణముగ నమ్మినాడ— నీ చరణాంబుజ సేవల
త్రిగుణ రహిత సదయహృదయ—త్రాహి శ్రీ రామకృష్ణ

2. పరమపురుష దీనదయా—పరవిగ్రహ నను బ్రోవర
వరదుడవని చేరినాడ-శరణు శ్రీరామకృష్ణ!

3. ఆటంకములను దీయర-ఆర్తుడనై వేడెద గురు
అరడి యిక నేల పరమ-హంసా శ్రీరామకృష్ణ!

4. **అనుభవానందంబుల-నొనరగ నా కందింపుము**
అరమర లిక మానుమయ్య-ఓ దేవ శ్రీరామకృష్ణ

## 12

రాగదే మా జనని శారదా
నీకొరకు జేమోడ్చి-నిలచియుంటిమె తల్లి ॥రా॥

1. సురలోక సంసేవ-పరతి నను మరచితే

కరుణ దయసేయవే-కనికరము నుంపవే

2. నీవులేని జగతి నిర్వీర్యరూపమే
నీ వెలుగులో విశ్వ-మే ప్రకాశించునే
సర్వమ్ము నీలోనె-సర్వదా గ్రాలునే సంతసము బొందువే
సకల సౌఖ్యనిధాన-శ్రీశారదామాయి

3. నీ దివ్య దర్శనము-నీ మధుర ప్రేమమ్ము
నీ తేనె పలుకులను- నిత్యమాశింతుమే
అనుభవానందముల-నర్థించుచుంటిమే
సకల శక్తినిధాన- శ్రీశారదామాయి

## 13

శ్రీరామకృష్ణ దేవుడా-మమ్మేలువాడ శ్రీరామకృష్ణదేవుడా
శ్రీరామకృష్ణదేవ-నారాయణ స్వరూప
పారావారాకారా-ధీర వేదసార

1. మేఘంబుపైన 'ఖగులన్-చూచి చూచి మైమరచి యుంటివే ప్రభూ!
ఆనాటి యనుభవమున-ఆనందమేది కలదో
అయ్యది మాకొసంగి! అయ్యా మమ్మేలవయ!

2. మాయీ సాక్షాత్కరింపగ-నానందముగ మాయీతో సంభాషింపవే
అట్టి మహాభాగ్య-మయ్యా మా కిప్పించి
తల్లి దగ్గరకు మమ్ము జేర్పవే మహాప్రభూ

3. దేవాధిదేవమూర్తులన్-నీముందు నిలిపి భావాల మించినాడవే
ఒక్క దేవునినైన-చక్కగ మాకు నిచ్చి
దుఃఖమ్ములను ద్రుంప- నొక్క యవకాశమిమ్ము

4. ఆధ్యాత్మికావధియగు నిర్వికల్పము నవలీల బొందినాడవే

క్షణమాత్రమైన మమ్మ-దాని జవి జూడనిచ్చి
అనుభవానందముల-మునిగి తేలనిమ్ము

## 14

నను గాన రాగదే-శారద-నను గాన రాగదే ॥నను॥

1. జనన మరణ సం-సారములో బడి
నిను గననైతితి-జన్మలనుండి
కనికరముంచవే-మాతా

2. చిన్నప్పుడే నీ-చిన్మయ రూపము చింతలుడుగ నే-దర్శనమొంద
చింతించెదగాదే-దేవీ

3. అనుభవానంద వి-హారి శారదా తనయుడంచు నను-గాను మాతాజీ
ప్రణమిల్లెద నీకే-తల్లీ

## 15

శ్రీరామకృష్ణుడేడే! ఓ చిత్తమా నా రామకృష్ణుడేడే!
రామకృష్ణుడేల రాడో ! ఏమి సేయుదు దోచదే! అను
రాగ విరహిత హృదయుడాతడు కాగలండా? కాడు కాడు! ॥శ్రీ॥

1. మాయితో సంభాషణ-గావించుచు మరచెనో తన పుత్రుని!
మాయితోడను నన్ను గూర్చి మాటలాడుచునుండెనేమో।
మాయి దర్శన ప్రాప్తి నాకు చూపింపవచ్చుండిచ్చు సత్యము!

2. నిర్వికల్పసాగర-విహారముచే మరచెనో తెలియదుగా !
నిర్వికల్ప సుధాబ్ధినుండి అమృతంబును వేడ్క తెచ్చి
నిశ్చలంబున గొల్చు నాకు నిచ్చు సత్యము సత్యమిదియు!

3. ప్రధానాత్ముండగు-వివేకునితో భాషించుచున్నాడదో।
శిష్యవర్యుని దరికి జేర్చి శిష్యగణముల నన్ను జేర్చ

జెప్పుచున్నట్లున్నది; విను; శిష్యుడను నే స్థిరము స్థిరము

4. ఇంకేమి కావలయునే-నాకిక ముందు ఇంకేమి లోవమ్మురే!
సాధనాదుల సక్రమంబుగ సాగజేయుచు రామకృష్ణుడు
అనుపమాన విభూతి పథమున అనుభవానందంబులిడును

## 16

కాళికా నీ వాడనే—కావవే నను పుత్రుని
కలనైన నే నిను మరువనే
కృపజూడవే పరమేశ్వరీ! ॥కా॥

1. ప్రేమవాహిని గల్గు నీహృది—బీడువారెనె తల్లిరో
శరణు జొచ్చిన వారి బ్రోచెడు బిరుదు వమ్మైపోయెనా? కలనైన .

2. నీవు ప్రేమతో జూచు భక్తుల—నేవిధిన్ సమమౌదునే
చిన్నబిడ్డగ నన్ను గాంచి చేరదీయవె మాతరో! కలనైన....

3. అమ్మరో! నీకంటె వేరుగ-నాప్తులెవ్వరు కల్గునే
అనుభవానందంపు బల్కుల నాడవే భవతారిణీ, కలనైన....

## 17

పాహి రామకృష్ణదేవా-పాహి పరమహంసరూపా
పాహి నిర్మలసుస్వభావా పాహి జగదాధార రావా ॥పా॥

1. నీదు చరిత విన్నవాడా నీదు నుడుల జదివినాడా
నీదు మార్గము ద్రొక్కినాడా నీదు పదముల బట్టినాడా

2. దిక్కు నీవని పిలుతునయ్యా గ్రక్కున నను బ్రోవవయ్యా
ప్రక్కన నను జేర్పవయ్య మక్కువతో శ్రీరామకృష్ణయ్యా

3. అనుభవానందములలోన అనుపమాన దీప్తిలోన
మునిగి యాడి లీనముగాగ మురిపెమున నను జేయగదయ్యా

## 18

ఏమి తెల్పుదునమ్మా—శారద ఏమి తెల్పుదునమ్మా.... ॥ఏ॥

1. జన్మలనుండి నిను గన లేక అమ్మ నాబడగ నెవ్వరు లేక
లోక యెడారిలో నుంటి తల్లీ

2. నిన్ను గనుటే శాంతి పదంబు నీ కౌగిలియే స్వర్గంబు
నీవే—ముక్తి—నిజమమ్మా నీదు అనుభవానందమొసగి
నీ దరి జేర్పవె తల్లీ—శారద

## 19

శరణంటిని కరుణింపుము—గురుదేవ మహాత్మా
పురుషోత్తమ పరమేశ్వర—కరుణారస జలధీ
పరధిక్కుల ధర గాంచను—పరమేశ్వర వినరా
చంద్రా క్షుదిరామ ప్రియ—సంతోషనిధానా ॥శ॥

1. నిను గొల్చుచు మునివర్యులు—నినుబొందిరిగాదే !
నను బాలన సేయంగదె — ఇనవంశజచంద్రా
నిను గాంచెడు ఘనభాగ్యము—గనజేయవె దేవా
ఛంద్రా క్షుదిరామప్రియ—సంతోషనిధానా

2. భరియింపగ దరమే సం—సారంబును తండ్రీ
హరియింపుము రక్షింపుము—కరుణింపుము దేవా
హరి యంటిని హర యంటిని—చరణంబుల యానా
చంద్రా క్షుదిరామప్రియ—సంతోషనిధానా

3. వినతిన్ గురు ప్రణమిల్లితి—మనవిన్ వినరాదా
అనుభవానందమ్ముల—దనియింపుము దేవా

నిను నమ్మితి నిను గొల్చితి— గనవా నను గొనవా
చంద్రా —ఖుదిరామప్రియ సంతోషనిధానా

## 20

కరుణించు శారదా—కాపాడరావే కనికరింపవె జనని—గతి నీవె కావె ॥క॥

1. అనుపమానంబైన - అనురాగమెటువోయె ?
అవ్యయంబగు ప్రేమ-ఆరిపోయినదే
అచలమై, అతులమై-ఆనందధామమై
అలరారు నీహృదయ-మేమైనదో కదా ఎటు పోయెనో తల్లీ

2. పసితనంబాదిగా-పాప సంగతిబోక భగవతీ నీపైన-
భక్తి నుంటిగదే
ప్రీతితో, భీతితో-వైరాగ్య వితతితో
భువినుంటి గాంచవే—భువనేశురాణీ భవనాశ కారీ

3. నిను జేరగా గోర్కి—అనలమై బాధించు
కనక నా లోపాల-క్షమియింపవే తల్లి
ప్రణుతితో ః నతితో-ప్రార్థింతు శారదా
అనుభవానందముల-ననుముంప రావే నెనరుంచు జననీ

## 21

రామకృష్ణదేవా-రాజితగుణ తేజోరూప రావేరా నన్నుబ్రోవ
రారా ః రారా ःకరుణనిధానా

1. అజ్ఞానములో బడితిర-ఆదరముంచర అమలచరిత్రా
అంతములేని మాయ ఆవరణంబును అంతము సేయరా

2. ఆనందస్వరూప నే నీ స్థితిలో నిక నుండనురా
అనుభవానందముల జ్ఞానవిభూతి నొసంగరా

## 22

రావే శారద రావే-బ్రోవను గాంచగ లేనే ॥రా॥

1. లోకంబను వనమున కడు దిరిగి వికలత నలిగి స్థితి వొలగి
   భ్రాంతి నుంటినే తల్లీ-శాంతి జాసితినె తల్లీ

2. ఎచ్చోటను గన విషయ మృగాలే :
   ఎచట జూచిన ప్రతిబిందాలే :
   నిదుర లేదుగద తల్లీ-నిలువలేనుగద తల్లీ

3. పదంబులన్-పట్టెదనే, నను గొనుతల్లీ ....
   అనుభవముల నిడు తల్లీ

## 23

రార । శ్రీరామకృష్ణా-దేవా-రార త్రిలోకతృష్ణా ।
రారా త్రిభువన మోహనరూపా । రారా సకల సురవర రూపా ।

1. భక్తుల బ్రోవగ లేదా మును-మోక్షము నివ్వగ లేదా
   నా ప్రార్ధన నీ చెవి జొరలేదో
   నవనీతంబగు హృదయము కరగదా

2. జన్మము గోరగజాలా-నే-గర్మకు లోబడజాలా
   జన్మకల్పనము నీవె జేసితివి జన్మవికల్పము నీదేగాదా ?

3. చిక్కుల బన్నగనేలా-నను-స్రుక్కగ జేయగనేలా
   చిక్కుదీసి నను ముక్తుని జేయుచు చక్కబరచవా నా దీనస్థితి

4. అమృతమయుడవు నీవే-పర-మానందుండవు నీవే
   అంతులేని నీ యనుపమ విభవము ఆహా। గాంచిన అనుభవానందము

## 24

శాంతి ప్రసాదము నిడవే తల్లీ । శోభన గుణగణవల్లీ ।
జన్మజన్మలుగ భ్రాంతికి లోబడి చపలత నొందితి శారదా ॥శాం॥

1. కాంక్షితపమున క్రుంగిపోతిగద । కామ పిపాసల బడలితిగా ।
ఆశాక్షుత్తున సొమ్మసిల్లితిని । అలసితినే నా జననీ ।

2. రోగజరామయ దేహ శకటమిదే సాగదు ముందుకు చూడగదే
ఇంద్రియాశ్వములు త్రోవన నడువవు ।
హేయ మానసము నడుపదుగా ।

3. స్తిమితము నాబడు నాశ్రయ మొసగి
ప్రేమ పలుకులతో దాహము దీర్చి
అనుభవ రుచుల నాకలి దనిపి నను దరిజేర్పవె జననీ ।

## 25

శ్రీ రామకృష్ణా! దీనశరణ! కరుణజూడరా!
నా ప్రేమనిధానా! దేవ! శారదనాథా! ॥శ్రీ॥

1. శిష్యుడనై సేవ జేయ భాగ్యము లేదే ।
చిత్రమందు నిన్నుజూడ తృప్తియు లేదే ।
నా హృదయసదనమంత నావరింప వేడెద
సర్వవస్తుచయమున నిను జూడ గోరెద

2. విశ్వమంత నావరించు కాంతిరూపమా!
వేదవేదాంతములకు యూదికేంద్రమా! ప్రజ్ఞాన సంద్రమా!
అనుభవానందమొసగి నన్ను బ్రోవరా
గురుదేవ్, గురుదేవ్, నా ప్రేమనిధానా దేవ శారదానాథా

## 26

దేవీ శ్రీ శారదమాయీ దీపింపవమ్మా-దయ జూడవమ్మా ॥దే॥

1. దివ్యమైన రూపుతోడ దిశలనిండు తేజముతో
త్రెంపులేని ప్రేమతోడ తేనెలొల్కు పల్కులతో

దయ జూడవమ్మా

2. పావనత్వమిడగా నీవే! ప్రాపు నాకు నీవే!
విద్యలొసగు దాతవు నీవే! వెలుగు నాకు నీవే!

దయ జూడవమ్మా

3. జ్ఞాన తృష్ణ నుంటిగదమ్మా అనుభవాల నడిగితినే
ఆదరాన బ్రోవగదమ్మా ఆనందమీవే

దయ జూడవమ్మా

## 27

శ్రీ కాళీ ప్రియ మనోజా నీకృపా మధుర రసమీరా ॥శ్రీ॥

1. నిగమాకారా । నిర్మల తేజా । భగవాన్ శ్రీ రామకృష్ణా దేవా ।

2. భవతారణ గురు-వర గుణశోభిత భావాతీతా । అనుభవదేవ ।
భయవిభ్రాంతుల-బారగద్రోలి పడయగ జేయవె-

భవదియాంఘ్రుల

## 28

శాంతి సుధారససే-వానార్థమై శారద సేవే గతిరా ।
సర్వ విషయతతి-దాటించుటకై సుకరంబైన- శరణ్యామౌరా ॥శాం॥

1. సారహితమగు-సంసారములో శ్రమ దీర్పగ-దుల లేనివౌరా।
సురవర్యుల-సుఖ మెంతటిదైనా సమమౌనట-రాగురుతించుకోరా

2. కామధేనువే। కల్పకతరువే। కోర్కెల దీర్పగ-చింతామణియే।
కామ్య వాంఛలు-సమసెడు బాట కాంచర అనుభవా-నంద రాజ్యము

## 29

నీవే నీవే కావగ దండ్రీ బిడ్డలమాపై-ప్రేమల జిమ్ముచు
భువి నానావిధిన-వతరించుచు సాధురక్షణ-సలుపుచునుండెడు
పరమేశ్వరుడవు-భగవంతుడవు ప్రభో। గురో। హరి। బ్రోవుము
దేవా

1. పూర్వ చరిత్రల-బూర్తి వెదకిన నేటి లోక గురు-కోటిని జూచిన
నిన్నుబోలు గురు-లున్నె మహాత్మా నీకు నీవే గద-నిక్కము సాటి
ప్రభో। గురో। హరి। బ్రోవుము దేవా

2. కల్పకమన్నది-కలదో లేదో। కామధేనువన-గల్పితమేమో।
అనుభవానం-దామృత రుచుల కోరు వెంట నిడు-కోర్కెల పంట
ప్రభో। గురో। హరి। బ్రోవుము దేవా

## 30

నాపై దయరాదా। జననీ నాపై కృపలేదా।
పలుమారు పలువిధ రీతులన్ నిను నెంతో వేడితినే, జననీ ॥నా॥

1. భువిలో సౌఖ్యము గలదే। ఈ పుడమిలో శాంతియు గలదే। ఆ
సౌఖ్య సంపద నీవటంచును స్వాంతమున గలదమ్మా

2. నే నిను బాసితినెపుడో నీ వదనము మనసుకు రాదే। ఆ
నాటి నీ మధురంపు ప్రేమయే నాకె నా హృదినమ్మా।

3. ఎల్లర నీవని నమ్మి-నా తల్లులు కారని తెలిసి-ఇక
నీదు సన్నిధి ప్రేమ జలధిలో నీదులాడగ వాంఛ

4. ఇహ పర సుఖములవేలా ? యీ మహి నిక బుట్టుకలేలా ?
నీదు యనుభవానందములకై నీతో నుండెదనమ్మా

## 31

గురుగుణ గణనాథా కోమలహృదయ దయాళు మహాత్మా

1. కామితార్థఫల కల్పకమూర్తీ ॥గు॥
2. నే నీ భక్తుల జేసనా? నిను దృష్టిగ గొలువన్ లేదా?
   సంకీర్తనముల దనియింపన్ లేదా?
   శరణా। రమణా। శ్రీ రామకృష్ణా।
3. నా భారము నీదంటినే। నీవే దిక్కని యుంటినే।
   నీపై యాశల భువి మంటిని కాదా। నిఖిలాధిపతీ। శ్రీరామకృష్ణా।
4. నీతో జనింప జేసితే? నీతో మెలగగ జేసితివే?
   నీ తన్మయతల గొలువన్ జేసితివే? ఇదియా కరుణా?
   శ్రీరామకృష్ణా!
5. పిలిచిన వెంటనే రాగదే! ప్రీతి మృదూక్తుల బలుకవే!
   ఆనందములో నను ముంపన్ రావే! అనుభవ జలధీ!
   శ్రీరామకృష్ణా

## 32

కానుపింపవే తల్లీ! కారుణ్యముంచగ రాదా!
కాంక్షింతు నీ ప్రాపే-అమ్మా శారదా! తల్లీ! శారదా! ॥కా॥

1. ప్రేమతత్త్వమన్న నీదే-కామితార్థ ధాత్రీ నీవేగదా వెలపూ-
   నిఖిల జగతిక్త
2. నాలో నిన్ను నుంచినానే-కాళికా! భవానీ! నీలోన నన్ను జేర్చి-
   నిలిపి యుంపవే
3. కనగజాల సౌఖ్య మిచట_కల్పకోటికైనా అనుభవాబ్ధి నీ యందే_
   అణగి యుందునే

## 33

దయానిధే! రామకృష్ణయ్యా దర్శనంబిడగ రావయ్యా ॥ద॥

1, పిలిచినను పలుకకున్నావే! ఏలకో కఠినమున్నావే!
కలదె యిది నీదు వంశమునా? గురువరా స్మరణ సేయగదే!

2. కాళికా కాంక్షగనువేళా కృష్ణుని గోరుకొనువేళా
కుములుచును నేల బడువేళా గురువరా స్మరణ సేయగదే

3. సాధనలో సిద్ధులలోగూడ శిక్షణలో రక్షణలోగూడ
లేరు నిను బోలు వారంచు గురువరా స్మరణ సేయగదే!

4. అనుభవము లేని మాకొరకే అవతరణ మొందితివి గాదే।
చాలికను న్యాయమే వదల గురువరా స్మరణ సేయగదే।

## 34

శారద బ్రోవగదే ఓ దేవీ। జగతిలో అలసి సొలసితినే
ఇక నిల్వగ లేనే.... ॥శా॥

1. సుఖమే యనుచు నీడల దిరిగి సుంత్తైనన్ విశ్రాంతియు లేక
విసివితి నెంతో భ్రాంతి మునింగి వేడుమంటినే నీ దరి జేర

2. నిను జేరుటకై గురువుల గోరితి నేర్చితి నే బహు విద్యాతతులన్
మతములనెన్నో సాధనలెన్నో మార్గాలన్నిటి గలచివైచితినే

3. మనమున శాంతిన్ గాంచగలేనే కన్నులకున్ నిమురేమియు లేదే
కనజాలనె యిట గమ్యము తల్లీ అనుభవ జలధీ నీవే నాగతి

## 35

నా నేరమా ! నా దోషమా ? నీ దర్శనము గోరుటే పాపమా !
నిన్ జేరనుండుటే దుష్కార్యమా ! ॥నా॥

1. పసితనమా ప్రభు నిన్ను నమ్మి వర్జించి యిహము

విషయావళిన్ ద్రోసి-భ్రమముల గోసి విపర్యయము బాసి
నీ సేవ గోరుటయే పాపమా !

2. అనుభవ వాక్యాల నిను జేరి వినుచు ఆనంద పడుచు
తనువును మరచుచు-నిను జేరిపోవుచు నెనలేని రీతిగా
మనగా నే గోరుచె నానేరమా

## 36

దరిశనమీయగదే జననీ శారదామాయీ భవభయమోచనీ ॥ద॥

1. హృదిలో నీ మృదు పదముల నుంచితి ముదమున నను నీవెప్పుడు బ్రోతువో
వదలు స్వభావము నీయదిగాదే సదమల హృదయా। అమృత నిలయా। ॥ద॥

2. అనుపమా నీ దివ్య వీక్షణమె అనుభవ సంపద మగ్నము జేయునె
ప్రేమ నిలయమా నీదు భాషణమే కామవివర్జిత ముక్తి నొసంగునే ॥ద॥

3. శిష్టుల చందము దుష్టుల చేగొని శ్రేష్ఠ పదంబున నిల్పితి కాదే
త్యాగ స్వరూపిణీ నను దయ గనుగొని ద్వైత దూరమౌ శాంతి నొసంగవే ॥ద॥

## 37

అదేల రావాకో। ఏది దిక్కొకో। శ్రీరామకృష్ణదేవా।
క్రీగంట జూడవో। ॥అ॥

1. నీ వాడగానొకో। నీ దృష్టి బడనొకో। ఆ పంచవటి క్రిందనే-
తపమునుంటివో।

2. శ్రీకాళిసేవ నుంటివో। భక్తతతిలో నుంటివో। భైరవి రానివ్వదో।
దిగంబరుడు వలదనెనో।రాగభయంబో।

3. పాశ్చాత్యభూమి వెడలితో-బేలూరుపైన రాగమో।
పుట్టినింటి కేగితో: పరానుభవానందమో-పరాకో కటకటా।

## 38

బిషం దేహి శారదామాయీ। దాక్షాయణీ। భవతరణి। శివా
కామ కాంచన విరహితమైన కోటిభాను సమ భాస్వరమైన

1. ఇహ పరార్థఫల భోగ విరాగము మోహ వివర్జిత శివ పదము
భోగాతీతము వైష్ణవ పదము బ్రహ్మపదము ప్రజ్ఞాపదము

2. సర్వసమత్వము సర్వహితత్వము శాంతి యహింసా సత్యస్మృ
సర్వోత్కృష్టాధ్యాత్మికానుభవ సంచయ శోభితమైన

## 39

రామకృష్ణ దయానిధే లోపమెంచకు గురుపతే
ప్రేమసాగర మీవెగాద కామితార్థ ఫలప్రదా ॥రా॥

1. వత్సలత మము బ్రోవగా వదలి స్వర్గము తృణముగా
భారతావని నవతరించి భువి ప్రశాంతి నొసంగవే

2. ధరలో నీ ప్రభ నెరిగినా పేరు మహిమల దెలిసినా
చరణద్వంద్వము మీద వ్రాలి శరణుజొచ్చగ నైతినే

3. ఋణము నీకెటు తీర్తునో అనుభవము నెటుగాంతునో
కనుల నశ్రుకణంబు లిచ్చి గనెద శాంతి జగద్గురో।

## 40

శారద జననీ- కరు-ణించి దర్శనమిమ్మా-మా ॥శా॥

1. నిను నే గనకన్ మనగలనే నీ పదముల యానా....

లోకము నామృగతృష్ణే సౌఖ్యము సున్నే నే

2. శాంతి నిధానము నీ పదము శివ శంకరమమ్మా....
ఆనందామృత స్రవము అనుపమానమమ్మా....

3. పరమౌ మోక్షము నీ ముఖము విరజంబే యమ్మా ...
జ్యోత్స్నా శోభలతలము చిద్రస సాగరము

4. తల నీ యంకముపై సునిచీ ద్వైతము మరచెదనే....
అయ్యదియే నా భాగ్యం అనుభవ సామ్రాజ్యం

# 41

ఎన్నడో నీ దయ-ఏకమై కలుగునో ఏ మని మొరలిడుదు-
ఎంతని ఏడ్తును

1. బాలు ప్రహ్లాదుని-ప్రేమమై బ్రోవవే పాపఢ నన్నటుల్-
పాలన సేయవే

2. మృగము గజేంద్రుని-మరువక బ్రోవవే మృగ సమమగు నను-
మన్నన గావదే

3. ధీరు వివేకుని-తీరము జేర్పవే వేరుగ నెంచక-
దరి నన్ను జేర్పవే

4. ఆనందమూర్తివి-అత్యంతశక్తివి అనుభవానందము-
లడిగితి నియ్యవే

# 42

నను జేరగదీవే ప్రేమనిధీ శ్రీ శారదా జననీ మాం పాహి ॥న॥

1. గురుశక్తి నిధానము నీవెగా కరుణామృత రూపము నీవేగా

2. తొలి గురు భార్యగ దరిజేరి మలి దేవతవై వెలుగొందితివే

3. ధవు తల్లిగ జూచుచు ప్రేమించి ధవు దల్లిగి మారిన మాతాజీ
4. నిజమాతకు మించిన ప్రేమమున సచరాచర జీవుల గై కొనవే
5. నిను బోలగ నెవ్వరు లోకమున అనుభవదాయిని భవతరణీ

## 43

దర్శనమిడరాదా ! గురుదేవా దర్శనమిడరాదా ! ॥ద॥

1. నీదు దర్శనము బడయక నీదు కృపా దృష్టి గనక
   చెదిరి పోతిని క్రుళ్ళిపోతిని కదలి పోతిని కృశియించితి
2. పహావరిజాబా భ్రాంతిలో పడిన వివేకానందుని
   లేవ దీయగ తేదే కరుణ దేవా ! నీ దర్శనమున
3. గోపాల బాలు గనక తాపమ్మున మ్రగ్గిపోవు
   గోపాలమాయిని దయ కాపాడితివెదుట నిలచి
4. ఘోర గుణములకు నెరయగు ఘోషు గిరీశుని జేకొని
   కనికరమున దర్శన మిడి కావలేదే దీనావన
5. వినతుడనై పేడువాడ తనయుడనై చేరువాడ
   అనవరతము నీ అనుభవముల అంద కోరితిని ఆదరముంపవే

## 44

పావన శుభ చరణా ! శ్రీ జననీ ! పాతక గుణ హరణా !-
భవతరణీ ! ॥పా

1. శ్యామ రామ సుత ! పరమ పవిత్రా రామకృష్ణ పదసేవన భరిత
2. నీ చరణాంబుజ సేవారతిలో నీ నామములో మరువగవలెనే !
3. అద్భుత జీవిత మీదే కాదే ఆరూఢత నా నీదే కాదే !
4. అనుభవదాయిని శారదమాయీ ఆనందసుధాస్వాదన మీవే

## 45

పాహి । ప్రభో । గురుదేవా-రావా- పాహి। గదాధర , రావా-దేవా- ॥పా॥

1. నీ పదపంకజ పూజా భాగ్యమే నిరతము గోరితి దేవా
   నీ ముఖ దర్శన తోషణ రుచిలో నిలువగ నుంటిగ రావా....

ద॥ 2. సుగుణ సువాసన సుమసంచయములు సుందరహారములివిగో
   భక్తి సుపాద్యము ఆత్మ నివేదన పరవశగంధములివిగో

3. నృత్యగాన కళాకవితల హాయిగ నిదుర మునుంగగ రావా-
   అనుభవ శాంతుల దన్మయ మొందగ నరుదేరగదే దేవా....

## 46

పాహి మాం శ్రీదక్షిణేశ్వరీ పాపవినాశిని పాహి మాం
పాహి ప్రణవ నాదబ్రహ్మమ పాహి మాయీ కాళికా ॥పా॥

1. విద్యావిద్యా విద్యాతీతా విద్యారాణీ పాహి మాం
   ప్రకృతిపురుష ప్రకృతికారణ ప్రణుతిమాయీ శారదా

2. విశ్వకారణ, విశ్వపోషణి విశ్వనాశని పాహి మాం
   విశ్వరూపిణి సూత్రధారిణి వందేమాయీ కాళికా

3. అవాఙ్మానస గోచరశక్తి అవ్యయరూపిణి పాహి మాం
   అనుభవానందవాహిని, దేవీనమో, మాయీ శారదా

## 47

॥పా॥

శరణు జొచ్చగా లేవా మనసా భారమాతనికె యీవా ॥శ॥

తా ।

1. నిను సృజియించి-నిన్ బోషించి నీకై పుట్టిన వాడే....
   సర్వం బొసగెడు వాడే, నీకై భారము మోసెడువాడే

2. కష్టము లోర్చి-కాలము మరచి కఠిన తపంబుల లేడా....
   అశ్రుల రాల్చగ లేదా, నీకై వ్యాధిపీడితుడు గాడా

3. భక్తియే లేదా-భయంబు లేదా పాపభీతియును లేదా....
హృదయ మింతయును లేదా-ప్రభుపై కృతజ్ఞతయును లేదా

4. అతడె ప్రభువు అతండె గురువు అవ్వాడే నీ దైవం....
రామకృష్ణుడే సర్వం-వినవే అనుభవానందం తడే 2.

## 48

శరణు శరణు మాతా, శారదా
శరణు శరణు మాతా, అంబికా ॥శర॥

1. పరమపావనీతా పహారిణీ
పాపవిమోచనీ శాంతిప్రదాయినీ ॥శర॥ 3.

2. హృదయనివాసినీ భావరూపిణీ నిత్యనిరంజనీ జ్ఞాన ప్రదాయినీ
భక్తిప్రదాయినీ పతిత పావనీ భవ భయ దోష వినాశినీ జననీ ॥శర॥

3. యోగదాయినీ సౌమ్యరూపిణీ త్యాగ విరాజిత మోక్షప్రదాయినీ 4.
అఘవినాశనీ అమృతదాయినీ ఆత్మ స్వరూపిణీ అనుభవ వందినీ ॥శర॥

## 49

శ్రీరామకృష్ణ నీ పరమ చరితామృతము
గ్రోల పరమానందము-బ్రహ్మానందము
ద్రావ నిత్యానందము.......
శిష్టవరులను రక్షసేయగ దుష్టజనులను శిక్షసేయగ
యుగయుగంబున నవతరించెడు సగుణమూర్తివి శ్రీ జగద్గురూ

1. అహహా! నీ ప్రేమను-అహహా! నీ కనికరము 1.
అహహా! సాగరతుల్యము-అగాధము

అహహో! వర్ణనాతీతము.........
స్పర్శమాత్రన సర్వాభవముల సర్వనాశన కారకుడవై
నిర్వికల్పసుధా ప్రవాహము జేర్చ జాలెడు స్పర్సవేది

2. మూడు దినముల క్రీస్తు-మూడు రాత్రుల బుద్ధు
మూడు నాడుల నిస్లాము-నిర్వికల్పంబు
మూడు రోజుల పొందుచు ...
సర్వమత సుస్సారమధు నా స్వాదనోద్భుత శక్తియుక్తి
సర్వమత గుణ సామరస్యము జాట గల్గిన సర్వశక్తి

3. దాస్యమున హనుమంతు-వాత్సల్యమున రాము
కృష్ణుని మధురమున-గోపాలుడవై గోవిందు సఖ్యమున....
వైష్ణవామ్నాయ భావస్థితులను జిష్ణురూపుడవై చరించుచు
సర్వవేళల సత్సమాధి వి హారచిత్తుడ హే జనార్ధన

4. నీదు యనుగ్రహము-నీదు శాంతస్థితుల
మధుర జ్ఞానపానము-మది గోరుచు
నతి దీనతను వేడుచు అనుక్షణంబు ననన్యభక్తితో
నంతరంగమునంచు గొల్చిన
అనుభవానందంబులొసగెడు అనుపమానంద స్వరూప

## 50

అమ్మా! నీ పాదరజము-నొదల ధరియింతును
ఆనందదాయకి పర-మానందోదధి తల్లీ!
అనుపమ కరుణాస్వరూపిణీ-హే! శ్రీదక్షిణేశ్వరీ

1. నీవకాచె విశ్వములను-నిర్మించుట, పోషించుట
నిరవధిక శర్వశక్తి-నిర్మలగుణగణసహితా

నాద బిందు కళ సంపద-నర్తన చతురాంబ : కాళీ

2. వాత్సల్యవాహిని ఘన-వైభవయుత జయలక్ష్మి
ఆదిశక్తి పరమేశ్వరీ-అగణిత రవి తేజస్విని
అనుభవానందాంబుధి-ఆహా! శ్రీభవతరణీ

## 51

శ్రీ రామకృష్ణుని-శ్రితగుణ కథలను చింతన సేయగ—వశమౌనే....

శ్రీరాముడు శ్రీ-కృష్ణుడు నొకరై
ధరణి బ్రోవగ— గరుణ జనించిరి
శ్రీ రాముడు పరి—పూర్ణావతారుడు
శ్రీ కృష్ణుడు పర—బ్రహ్మస్వరూపుడు
రామకృష్ణ నిజ—మర్మము దెలియన్
సామాన్యమె గన-శేషునికైనన్

1; జగమునందు నజ్ఞాన తిమిరమున్
భగవాన్ రవివలె—బారగ ద్రోలెన్
శీఘ్రంబను గను పైచ్ఛ్రశ్వమెక్కి—
సద్వివేకమను-ఖడ్గరాజమున
సర్వపాప భయ—హారకుడౌచు సాత్త్వికజన పరి—పోషకుడౌచు
కోటిసూర్యసమ—ఘాటి తేజమున ఘనత జెలంగిప—కల్క్యవతారుని

2. వాసస్థానము—బాసి యడుగిడక బాసురమగు లీ-లల జూపెన్
తోతాపురి, జట—ధారి, భైరవీ
మొదలగు గురువులె — వెదకుచు వచ్చుట
సుమమును మధుపము—జేరునట్లయ
స్కాంతము లోహము—చేరు చందమున

శిష్యవర్గములు-చేరుట జూడన్
చింత్యమౌనె యా-చిద్విలాసములు

3. అవఙ్మానస-వ్యాపకుడైనను అవిరళమగు కృపా—స్థావర మగుటన్
నిరాకారుడును-నిర్గుణుడయ్యున్
పూర్ణ దయాపర,స్వాత్మరూపుడై సర్వమతంబుల-సామరస్యమను
గురుసందేశము-ధరణిలో జాటన్
స్వల్పకాలమున-సకలమార్గముల పారము జూచిన-పరంజ్యోతియౌ

4. సర్వధర్మ సం-స్థాపనార్థమై యుర్విజనించిన-పరమేశ్వరుడే
మత్స్య, కూర్మ, వరాహ, నృహరి, వా
మన, భార్గవ, రామ, కృష్ణ, బుద్ధ, కల్కి-
అనబడు పరమ దశావతారుడు అవ్యయుండు ఘన—నిర్వికారుదు
ఆది మధ్యమను యంతము లేని
అనంతుడనంభవానందుని గురుని

# 52

అమ్మ నీకన్న నధికులెవరమ్మా—శ్రీ శారదమ్మా ॥అ॥

1. అమ్మవే నీవు—కమ్మవిల్తుని కమ్మవే భువ—నమ్ములకును
అమ్మవే, మహి-మమ్మవే, కరు ణమ్మవే, స—ర్వమ్మవే తల్లి

2. కార్య కారణ-కారణంబై కారణ రహిత—గురుతత్త్వంబై
దూరమై, యతి—చేరువై, ధీ సారమై, భవ-తారకంబౌ

3. నిర్గుణంబగు-నిర్మలంబగు నిశ్చలంబగు-నీ తత్త్వంబు
నిరతిశయంబై-నిరవద్యంబై నిరవధికంబై-నిరుపమమౌగా

4. ఇష్టంబౌదువు-శ్రేష్టంబౌదువు సృష్టి స్థితి లయోత్కృష్టాధారీ
కష్ట విదారకా-భీష్ట ఫలప్రద శిష్ట రక్షిణీ-ఇష్టి రూపిణీ

5. అందమును మరవిందమునువలె చందురుని చలి-మందనమును
డెందమున నా-నందమనుభవ సంతతులుగల-సుందరి నమస్తే

## 53

నిన్ను దెలియ వశమా—గురు దేవా-నిన్ను గనగతరమా ॥ని॥

1. కార్యములన్ననో—చిత్రచిత్రములు పల్కులన్ననో-పసిడి పదంబులు
2. దుష్టతను జను-గిరీశ భాబును పరమభక్తులలో- జేర్చుట జూడగ
3. పండితవర్యు డ-ఖండప్రజ్ఞుడగు కేశవ చంద్రుని-శిష్యుని జేసిన
4. విద్యలేక పర-విద్యానిధివై విద్వాంసుల నీ-పదముల జేర్చిన
5. తొలి కష్టంబును-మలి సౌఖ్యంబును కలుగజేసి నా-నిలకడ జూచెదు
6. ఎల్లచోట్ల నను-జల్లగ జూచుచు
అనుభవానందము-లనయము నిచ్చెదు

## 54

శారద ప్రేమనిధీ ! విద్యాంబుధీ । ॥శా॥

1. పార రహిత గురుశక్తి నిధానా ! చారుతరప్రభా దీప్తి సంపన్నా !
2. రామకృష్ణపద పంకజ భృంగా ! రాజిత బ్రహ్మానంద తరంగా !
పరమహంస పరిసేవిత చరణా । వరగుణానుభవానరవ తరణా !

## 55

పాహి శ్రీరామకృష్ణా పాహి లోకైకతృష్ణ
పాహి విశ్వస్వరూప పాహి పాహి.... ॥పా॥

1. శిష్టరక్షణ దుష్టశిక్షణ చేతలన్ విరమించి నేడు
శిష్టదుష్ట రక్షణంబే నిష్టగా గైకొన్న దేవ
2. కామినీ కనంబులకు గల కామతత్త్వము నూడదీసి
కామతార్థ విముక్తి పదవీ ధామమార్గము జూపు దేవ

3. శాస్త్రచర్చ విచారణాదుల జాడలెల్లను నిష్ఫలమ్ములు
ఉగ్రసాధనవలన గద్దెడు అనుభవంబును చెల్పు దేవ

4. గురువులకునై పరుగులెత్తకు గురువులే నీదరికి వత్తుర
టంచు నా పరమోపదేశం బిచ్చనో దేవ స్వరూప

5. మనసునే స్వాధీన పరుపుము అన్నియు నిన్నాశ్రయించు స
టన్న అనుభవానందముల న త్యున్నతిని ప్రకటించు దేవ

## 56

అమ్మను - మా శారదమ్మను - రారండి గొల్వను ॥అ॥

1. సర్వ జగతి మాతృ ప్రేమ ముంచిన తల్లీ
భర్తను తన తల్లిగ వీక్షించెడు తల్లీ ।
ఎవ్వరూ పోలంగ నెవ్వరూ

2. రూమనగ మేలిమి బంగారు బొమ్మగా
లోపల నిర్విషయచంద్రికా చయమ్ముగా
గాంచుటతో.... తెలియకనే
గురుపదపద్మమ్ములకే లాగెడు తల్లీ-రక్షించెడు తల్లీ
ఎవ్వరూ పోలంగ నెవ్వరూ

3. శాంతిరసము లోకములను ముంచి పారగా
సాక్షాత్తు బ్రహ్మదీప్తి జగతి నాడగా
కాళికయే .... చిరునగుతో
సకలసృష్టి ప్రేమమయము-సేయగరాదే
అనుభవము నీయదే
ఎవ్వరూ పోలంగ నెవ్వరూ

## 57

దేవా ! సర్వాత్మా ! సుప్రభావా
శ్రీరామకృష్ణగురు-దేవా........
లీలా మానుష-లీల వినోద, వి
శాల హృదయ, కరు-ణాలవాల హరి

1. సకల తత్త్వార్ధ పథగమనా
సర్వోత్తమ ప్రభా-జాలా-నిర్మల గుణశీలా !
భక్తిజ్ఞాన వై-రాగ్య నిధాన, సత్
కీర్తి దీప్తి వి-ఖ్యాతమూర్తి గురు

2. విశ్వమోహన చక్రవర్తి ప్రఖ్యాత ప్రస్ఫుట-వేదా
వేదాంత వ్యాఖ్యమూర్తి
సర్వలోక గురు-శౌరి, పరాత్పర కర్మబంధహర-కామిత ఫలదా

3. పరమ పావన పవిత్ర
సద్భక్త ప్రియమిత్ర-ధర్మ-సంస్థాపకాచార్య
సారరహిత సం-సారవిదూర, అ పార తత్త్వరస-ధార ప్రదాత

4. అవాఙ్మానస గోచర
మందస్మితానన-దేవా-దేవాధి దైవరాయ
అనుపమాన ప్ర-త్యక్షావతార అనుభవానం-దామృతసార.

## 58

శారదమాతా-సకల పునీతా
శాస్త్రాగమనుత-సర్వహితా మాతా ॥శా॥

1. సారవిహీనమే-సంసృతి సుఖమే
స్వాత్మానందమే-సమ్మతమే మాతా

2. ఉపనిషదర్థము-ఊర్ధ్వవిధానము
ఉన్మని స్థానము-ఉత్తమము మాతా

3. నీ కొరకేగదే-నిలబడు జగమిదే
నిర్మల సుఖదే-నిత్యనిధే మాతా

4. అతులకీర్తి ప్రదా-అఖిలవంద్య సదా
అనుభవానందా-ఆనందా మాతా

## 59

రామకృష్ణుని మనసారా ప్రార్థించి ధన్యత గనవే
భక్తి తోటిలో-సుగుణ సుమంబుల
చక్కగ మాలగ-జేర్చుచు గట్టి
మందబుద్ధులకు-నందని కంఠము
నందు జేర్చి యానందమొందుచు

1. శమదమ షట్క లతాంతల్ సాధించి సరగున జేర్చి
పూర్వవాసనా-పూర్వ గంధముతో
అక్షయమనియెడు-అక్షతాదులతో
దుర్మార్గులకు-దూరంబగు నా
నిర్మల పదముల-నిశ్చల వృత్తిని

2. వైరాగ్య భక్తి జ్ఞాన పత్రిన్ ప్రేమతో జేర్చి
నిష్కామంబను - నిర్మలోదకము
భక్తి శ్రద్ధలను - పసుపు కుంకుమల
పరమ భక్తులకు - బరమావధియును
కరుణా నిలయము - నేత్రమ్ములుగల

3. ఆత్మ విశ్వాసంబవ్ అరవిందములను మెచ్చి
గురువిశ్వాసాంబురుహంబులను
నిర్భయమనియెడు_నీరజములను
అనుభవానందము - కాలవాలమో
అనుపమ హృదయంబారాధింపవే

# 60

శారదా ! ప్రియజననీ ! సుర ముని వందిత పదయుగళా ! గళా

1. నేరా నిన్ బొగడా-కాళీ ! బగళా ! శివకళా
2. నీ అతుల విభవముననే పతిని జననిగ గని-నుతపథమిడు జననీ
కృపాపూర్ణపీ-తపోధనీ-అపారిణీ విభూతి సహిత ప్రభాంజనీ
3. లోకాన-విని ఎరుగని-ప్రజ్ఞాన-అనుభవమున
సంధానమునుగను నదు-నేగాన-లేనె !
నీకే, నీవే, సాటి, మాతరో

# 61

శ్రీరామకృష్ణ చరణాంబుజ సేవలా
వరమోక్షార్థము మనదిసుమా
పరమానందోదధి విహరింపగ నిరుపమమగు సత్పథముగదా

1. సర్వపాపభయహారక ఖడ్గము సామాన్యులకది దొరుకదుగా
కోరిన వరముల దీర్పగ నద్భుత కామధేనువన సత్యముగా
2. ఆనందోజ్వల చేత్పరికాశమున నాట్యము సల్పగ సులభముగా
అద్వితీయమగు అనుభవానందామృతసార నిధానముగా

## 62

మాటగోరువాడనమ్మ-శారదా పరమేశ్వరీ ॥మా॥

౧. చక్కదనాల బొమ్మ-సర్వకళా పాదపమ్మ
శాంతికిరణ శోభితమ్మ-సుఖదమైన నీ ముఖమ్మ

౨. నీ చిరునగు వెన్నెలలో-నీదు కృపా సింధువులో
నీదు ప్రేమవాహినిలో-నిరుపమవిధి దేలియాడ

౩. మునిగణ సంసేవితమును-ఆనంద సంభరితము
అనుభవ పరిపూరితమును-అనుపమగు నీదు పదము

## 63

పూజింపగ రండు రండు - పూతచరితు రామకృష్ణు
పూర్ణానంద స్వరూపుని-భువనత్రయ పాలకుని
భక్తితో హృదయము నిండ భావ సమాధుల మున్గి

౧. రామకృష్ణ శారదలను-ప్రేమావతారములను
పరమ పవిత్ర చరిత్రుల-పావన కీర్తి శోభితుల
నిర్మల చిత్తమ్ములతో నిశ్చల ధ్యాన నిమగ్నత

౨. నిర్విచార నిర్వికార-నిరతిశయానందులను
నిరుపమ గుణగణవిభవుల-నిర్మల కరుణదయుతుల
విషయములను ఖండించి ఈషణముల దెగటార్చి

౩. లోకైక గురుదేవుని-లౌకికగుణ నాశకుని
అఖండతేజోప్రావృతు- అనంతశక్తి సమన్వితు
అనుపమ తన్మయత్వమున అనుభవానందోన్మత్త

## 64

శారదె సర్వస్వం మన శారదె బ్రహ్మానంద రాజ్యం ॥శా॥

1. మృదు మధురంబౌ వాక్యం సదమలమగు ఆ యనురాగం
హృదిలో నివసించు ప్రశాంతం శారదయే శివ శంకర రూపం

2. సుర ముని సేవిత చరణం వర సంధాయకమౌ హస్తం
పరమౌ తేజో ముఖపద్మం శారదయే పరమాత్మ స్వరూపం

3. అగణిత గుణగణ పూర్ణం అనుభవ శతకోటి యుక్తం
అసలే యవగాహన దూరం శారదయే గద స్వస్వరూపం

## 65

శ్రీ రామకృష్ణం భజ-ఓ మనసా- శ్రీరామకృష్ణం భజ
రామకృష్ణుని భజన చేసిన కామషట్కము సమసి పోవును
కామితార్థ సమూహమంతయు నీమముగ నీ దరికి వచ్చెడు

1. భావాలలో మున్గకే-ఓ చిత్తమా భావాలలో నిల్వకే
భావజాలమునందు తృప్తి త్రోవదీయును నాశనమునకు
భావి కర్తవ్యముల దలచి నీవు సార్థక పరుపు జన్మము

2. నా మాటలాలింపవే-ఓ మనసా నా మాట జవదాటకే
మాటలోనే గలదు భక్తి మాటలోనే గలదు ముక్తి
మాటయే సర్వ ప్రపంచము మాటయేసుమ ప్రణవ బ్రహ్మము

3. సాధనాదులె ముఖ్యమే-ఓ చిత్తమా సాధనాదులె ధర్మమే
దానివలన గలుగు స్థిమితము దానివలన చిత్త శాంతత
దానివలననె సర్వవిధముల అనుభవానందంబు గల్గును

## ౬౬

పాహి శారదా-పరమ సౌఖ్యదా

పాప విధ్వంసినీ బ్రహ్మాండ జననీ ॥పా॥

1. ప్రణవ రూపిణీ-పతిత పావనీ

పరమహంస సేవిత దివ్యచరణే

2. వేదశాస్త్ర విద్యా స్వరూపిణే ఖ్యాత సృష్టి స్థితి లయ కారిణే

భవవినాశినీ అనుభవానందినీ భక్తపోషిణీ మధురభాషిణీ

## 67

ఎంతనీ ధ్యానింతు-శ్రీరామకృష్ణయ్యా

సుంతైన నీదు ఘన-శోభ దెలియ

తలపగా దలపగా-దలపుకే దూరమై

ప్రజ్ఞాన ఘనరూప-బ్రహ్మమగుదే

1. సాధుజన సంరక్ష-సంకల్పమును బూల్చి

సాకారమును బొందు-సంప్రదాయమున

శ్రీగదాధరదేవ-వైకుంఠమును వదలి

శ్రేష్ఠావతారమున-జెలగినావె

2. పుట్టి పుట్టకముందే-పుడమిపై దొర్లుచును

బూడిగుంటను గల విభూతి బూసి

నెలల ప్రాయంబుననె నీ దేహమును మార్చి

నీ యథార్థత జాటు-నిర్మలాత్మ

3. ఉయ్యాలలో శయనించి-యూచు నీ తల్లికిని

యత్కృష్ట రూపంబు-నూని జూపి

నామరూపాతీతధామమందున నిల్చి
బ్రహ్మతత్వంబులలో-సొమ్మసిలితే

4. భైరవీ ప్రార్థింప-ప్రేష్టరూపము దాల్చి
భూతాంతరాత్మవని-ప్రకట పరచి
అఘోరమణి గోర-శ్రీకృష్ణరూపమున
అవ్యయ ప్రేమమున-నాడినావే

5. మధుర ధన్యుని జేయ-నర్ధనారీశ్వరుగ
మధురరూపము దాల్చి-మహిమ జూపి
శారదామాయికిని-శక్తి కాళిగ దోచి
సత్యస్వరూపంబు-జాటినావే

6. దృష్టిచే, స్పర్శచే-దలపుచే, వాక్కుచే
దివ్యాత్మరసములను-ద్రావ జేసి
అడుగడుగునకు నీదు-అద్వితీయత్వంబు
అత్యంత విదితముగ-జేయు నిన్ను

7. నినుగూర్చి యోచింప మనసునకై దూరమై
అనుపమానంబుగను-తనరి యుండి
అందియందనిరీతి-నానంద ఘనుడవై
అనుభవానందముగ-నగుదువయ్యా

## 68

తెలియ నేరికానే-నిను-నెరుగ సాధ్యమౌనే
పరమేశ్వరీ భవానీ ॥తె॥

1. సుర నర కిన్నెర సాధ్యతతులు నీ కరుణను నుందురుగాదా ;
మూర్తులు ముగ్గురు మూడు శక్తులతో
శారద నీ కళలగు గాదా ;

2. భువనమెల్ల నీ దేహమౌనుగదా ; రవి శశి కన్నులుగాదా;
నీ విభూతి దారకలు పొగడుగదా; జీవుల తారకమీవుగదా ;

3. తమసమునా సృజియించి రాజసమున బోషించి
ప్రేమమీర-భవతరణిచూచు-ముక్తిమార్గమౌచు
మము సత్వమున గొనవే
ఏమి తెల్పుదును-నీ మహిమమును
బ్రహ్మమనగ నీవే-తల్లి-ప్రణవనాదమీవే
మమ్ము బ్రోవగా నవతరించిన
ప్రేమమూర్తివమ్మా-జననీ-కామధేనువమ్మా
నీ యనుభవమును స్తుతియింతున్
నీ యానందము గీర్తింతున్ నీ పదయుగళము సేవింతున్
పూజింతున్-ధ్యానింతున్ మైమరతున్-శాంతింతున్

## 69

చింతింపనేల నాకు-శ్రీరామకృష్ణుడుండ ॥శ్రీ॥

1. సర్వలోకములకు నెల్ల-సృష్టికర్త నాదు గురువు
సర్వదయా పరిపూర్ణుడు సాటిలేని మహాప్రభువు

2. జీవకోటులెల్ల యతని-కృపపై నాధారపడును
అతనికన్యమొకటియైన లేదీ విశ్వంబునందు

3. అంతటను నిండియుండి-అంతయు వీక్షించుచుండి
అనుభవానందంబుల మునుగజేయు సత్యమిదియ

## 70

నే నాడెదనే-పాడెదనే-శారదమాతా
వినవే ముదంబు గనవె లోకప్రపూతా ॥నే॥

1. నీవు నాకు నెదుట నిలచి నిత్యమైన యుండగాగ
నిర్భయమే! సుఖమే! శారదమాతా
వినవే ముదంబు గనవె లోక ప్రపూతా

2. అనుభవమే మధురసుధా అదియెగదా నీదు పదము
అక్షరమే! పరమే! శారదమాతా
వినవే ముదంబు గనవె లోకప్రపూతా

## 71

ఇంత యంత కాని దహహ-ఎంతయో విశాల
వంత మద్భుతంబు నీదు-చరిత తెలియజాల

1. చూడ జూడ విశ్వభక్త-దేవమూర్తులెల్ల
జేరి నీలో నైక్యమగుట-స్పష్టమగును దేవ

2. ద్రావ ద్రావ నవ్యరుచుల-దాటి మధురతమంబై
దివ్యశోభ గలిగి సుధను-మించిపోవు దేవ

3. మున్గ మున్గ ననుపమాన-అనుభవ రత్నమ్ములు
అగణితాద్భుతంబులౌచు-వెల్గుచుండు దేవ

4. తలప దలప భావపథము-దాటి యేగుచుండి
పోల్పరాని తన్మయత్వమందు ముంచు దేవ

5. అహో అహో మహాదేవ-అనుపమ ప్రభావ
అగణితగుణ గణవరిష్ట-అనుభవానంద దేవ

## 72

నాకిక నేభయమమ్మా-నిను నమ్మినవాడగదమ్మా
నా వగపేమీ! జనని నా వెరపేమీ ॥నా॥

1. లోకాన దిరుగువేళా-కలలోన మునుగువేళా
లయమైన నిద్రలో-నా భ్రాంతి గడియలలో
నీవయే గలవమ్మా-జనని నా వెరపేమీ

2. బంగారు రాసిగాని-భ్రమియించు యువతిగాని
పైదుముకు కీర్తియే-నీ పాదరేణువుగా
పరముగా నీ సేవ-జనని నావెరపేమీ

3. నీవే నాకు తోడు-అగు-నీవే నాకు నీడ
నిలచేటి యండయే-ఆనంద కందమే
అనుభవానందంబే-జనని నా వెరపేమీ

## 73

రామకృష్ణుని మహిమ దెలియగా
రాగ, ద్వేషము మానురా
రామకృష్ణుని శుద్ధ రూపము
నీమమున లో గాంచరా

1. మానస సరోవరంబున నున్న యలలను మాన్పరా
విషయవాసనతో జనించెడు విషయములె కెరటాలురా
2. హృదయదర్పణమందు నిండిన వ్యర్థ ధూళిని గుడువరా
ఆశాసూయా మొదలగు బుద్ధులె అద్దము జెరిచిన దుమ్మురా
3. దహరనగరపు మార్గమున గల దంతిపైరుల ద్రుంపరా
క్రోధ కామ లోభ మోహ మత్సర మదములె రిపులురా
4. సర్వద్వంద్వము లణగ ద్రొక్కి సాక్షివై వెలుగొందరా
అప్పుడే శ్రీరామకృష్ణుని అనుభవానందంబురా

## 74

ఏమందు శారదా-ఎట్లందునే ॥ ॥ఏ॥

1. "దేవి" యటన్ బిలువ-దీపింతువే యటనో ॥
"తల్లి" యని ప్రేమింప-తగదనా ప్రేమ
2. ప్రాణంబవే యంచు-భావింతునే
హృదయమందున నిల్చి-ఇంద్రియంబుల బూన్చి
అనుభవానంద పథమందు నను నడుపుచో
నీయంత నే గానదే-మాతాజీ
నీలోన లయపడనదే భవతరణీ

# 75

శ్రీరామకృష్ణ గురు చిన్మయానంద ప్రభు
సేవింతు నిను సదా చేరదీయగదే ॥శ్రీ॥

1. నీ హృదయమందుగల నిత్య నిర్మల శాంతి
నిరుపమానందరస నిధులనిచ్చెడు దేవ

2. శ్రీ శారదామాయి జీవకోటులపైన
ప్రవహింపజేసెడు పరమ వాత్సల్యంబు
నీ నుండి జనియించు నిజము గాదే
లోకాల మురిపించు శక్తి గాదే

3. శ్రీవివేకానందు శ్రితగుణ జ్ఞానంబు
స్వామి బ్రహ్మానందు వరధ్యాన విభవంబు
రామకృష్ణానందు ప్రఖ్యాత భక్తి
యోగిలో స్పష్టమా ఉత్కృష్టమా శాంతి
గౌరీమాలో శక్తి గోపాలమా భక్తి
నాగ, రాముల రక్తి శ్రీగిరీశు విరక్తి
నీ ప్రసాదంబు గద నిఖిల శక్తినిధాన
నిను తెలియ సామాన్యమే ! అనుభవానంద విభవా !
జయ రామకృష్ణా ! జయ రామకృష్ణా ! జయ రామకృష్ణా !

# 76

శారదా దయానిధీ సరస గుణాబ్ధి సుధీ....

1. నీ నిర్మల మార్గమునే నీ సుస్థిర పదములనే
నిత్యము మా ముందుంచుము నీ వెనుకనె యరుదెంతుము

2. నీ సౌఖ్యము యిల గలదే నీ శాంతము భువి గలదే
నిశ్చయముగ నిట లేదని నీ వెనుకనె యరుదెంతును

3. నీ యనుభవ నగరములో నీ మధురా భవనములో
నీ యొడిలో మన నెంచుచు నీ వెనుకనె యరుదెంతును

# 77

ఏమి తెల్పుదున్ నేనేమి పల్కుదున్
శ్రీరామకృష్ణ మహిమను నే ॥ఏ॥

1. జన్మ సిద్ధుడై సన్న్యాస మూర్తియై
సాధించి సాధనల్ సౌఖ్యాబ్ధి మున్గుచున్
ఏకమేవాద్వితీయమంచు జాటెడున్

2. శక్తి యాతడే శంకరుడు నాతడే
శ్రీ రాముడాతడే శ్రీకృష్ణుడాతడే
సర్వదేవ దేవిరూప ధారుడాతడే

3. అద్వితీయుడై అఖండ తేజుడై
అనంత రూపుడై అవర్ణణీయుడై
అనుభవానందమనెడు బ్రహ్మమాతడే

# 78

అమ్మరో అమ్మరో ఎంత దానివమ్మరో
అద్భుతంబుగదా నీదు చరిత శారదాంబరో ॥అ॥

1. పల్లెలోన పుట్టి పట్న పౌరులచేనమ్మరో
పుట్టు పేదవయ్యు ధనిక వర్గముచేనమ్మరో

చదువు చెంతబోక విబుధ సంఘముచే నమ్మరో
సాష్టాంగ వందనాల చెలగినావె అమ్మరో

2. ఆడదానివగుచు మగ వారిచేతనమ్మరో
భార్యవలె సంచరించి భర్త చేత నమ్మరో
సర్వ బాంధవముల కలిగి సర్వులచే నమ్మరో
సకల సంబంధములలొ పూజగొనుదువమ్మరో

3. చక్కనైన నీదు ముఖ స్వర్ణకాంతినమ్మరో
లెక్కలేని నీదు మృదు వాక్కులలో నమ్మరో
పరంబైన నీదు యనుభ వాబ్ధిలోననమ్మరో
వందయేళ్ళలోనె లోకమంత మునిగె నమ్మరో

## 79

గురువర ! గుణనికరా భవహరణా ! ॥గు॥

1. పరమహంస కరుణాకర ! వరదా !
నిరుపమ సుఖరససాగర ! శౌరీ !

2. రఘుకులమణి ! యాదవదళ నాయక !
నగసుత ధవ ! బ్రహ్మాండ స్థాపక !
రామకృష్ణ గురు ! హరిహరాకారా !
కామితానుభవానందవిహారా !

## 80

శారదమాయీ నీయాదర్శము
సౌఖ్యసంపదల ముక్తినిధానము
జ్ఞానవిదూర లోకములోన
సరియగు మార్గము దర్శక జ్యోతి ॥శా॥

1. కలిమియు లేమి లాభాలాభము
కష్టము సుఖము సమువడు పసము
అహేయ హేయము లణగే మార్గము అతుల విధానముగా ॥శా॥
2. కరుణ నిధానము ప్రేమ నిలయము
పరమ పవిత్రత కాలవాలము
ధార్మిక జీవనమందు నిదర్శము దైవమార్గ మదిగా
3. ఆత్మవిలోకన సుఖసాధనలో
అనుభవానందాస్వాదన కేళిలో
అత్యంతాద్భుతమై ఆసనము అమరయోగమగునా ॥శా॥

## 81

రాగచే చిత్తమా రామకృష్ణుని గొలువ
లోకాలు వెతకినా సోకునే పోలగా ॥రా॥
1. లోకకళ్యాణమై లోక దేహము దాల్చి
సాకార బ్రహ్మంబు సాక్షియును నాతనే
2. వేదాంతములలోన వేదితవ్యంబైన
శాస్త్రిలచే బహుళ సంకీర్త్యమై యున్న
మౌనీంద్రకోటిచే ధ్యానింపబడుచున్న
బ్రహ్మమే యాతండు భ్రమయేల వేవేగ
3. ప్రేమవాహిని యతడు కామధేనువె యతడు
కామదూరుని జేసి కడదేర్చు తెలియవే
మోహ శృంఖల జిక్కి మొరబెట్ట నింకేల
పట్టవే బంగారు పాదపద్మమ్ముల

4. గణియింపగారాని కళ్యాణ గుణములన్
ఎనలేని సుజ్ఞాన దినమణి ప్రభలతో
అనుభవానంద మధురామృతోదధిలోన
మునుగగా, కరుగగా, తను మరచిపోవ

## 32

తల్లి మము బ్రోచుటకు మేలుకోనవే !
తరియింప కాంక్ష నీ దరిజేర నుంటిమే ॥తే॥

1. సతము బ్రహ్మపదాన స్థిరత నివసిల్లున్న
సుతుల మాగతి యేమి హృది జూడవే దేవి

2. ఎందరో దేవతల- నెరిగి మది గొల్చితిని
ఎందరో గురువులను నెంచి సేవించితిని
శాస్త్రముల జూచితిని క్షేత్రాల కేగితిని
శారదా నీకంటె శరణమేదే దేవి

3. నీదు చారిత్రమ్ము సదమలము సత్యమ్ము
నీదు జీవన పథము నిజము పవిత్రమ్ము
నీదు స్వరూపమ్ము నిత్య నిర్మోహమ్ము
నీసములు లేరుగద నిర్మలాత్మ ! దేవి

4. కనిన నీ రూపంబు కనకమయ విగ్రహము
వినిన నీ భాషణము విమలమధురామృతము
మనిన నీ ప్రేమమున దనరు దివ్యత్వమ్ము
అనుభవానందముల అద్భుతాకృతి ! దేవి

## 83

కనుగొనవే అనుభవింపనే తనివితీరగా ప్రభుని........ ॥క॥

1. రామ, కృష్ణ, చైతన్య స్వరూపున్ శ్యామల, శంకర మతమూర్తిన్
   సర్వవిభూతుల మహాచార్యుని సకలాధ్యాత్మిక భానుతేజుని

2. లోకాతీతున్ మహాత్ముని లోష్టకాంచన సమభావున్
   ప్రేమమూర్తి, నసమాను, విశాలుని
   రామకృష్ణుని, అనుభవున్ శ్రీ గురుదేవున్ సద్గురున్

## 84

ప్రేమహృదయమా భగవతీ మాతృదేవతా శారదా ॥ప్రే॥

1. విశ్వరూపమగు నీ స్వరూపమున విమలంబగు నీ హృదయసీమలో
   విస్తరించు నీ మాతృప్రేమలో విలీనమగుటే ముక్తిధామమగు ।
   విద్యారూపిణీ భవతరణీ । విద్యారాణీ మా జననీ

2. విషయసహితమగు నీ విశ్వంబున విషయరహితవై వెలుగొందితివే।
   విషయ వాసనలే జ్ఞాన సాధనకు విషసమంబులని బోధించితివే ।
   ఉమా స్వరూపిణీ భవతరణీ విజ్ఞానదాయినీ మా జననీ

3. త్యాగంబునకిల పట్టుగొమ్మవై త్యాగరూపిణిగ గీర్తి గాంచితివి ।
   త్యాగీశుని నీ సన్నిధి జేర్చి । త్యాగవిభూతుల బ్రసాదింపవే ।
   ఆనందరూపిణీ భవతరణీ। ఆనుభవానందినీ మా జననీ

## 85

ప్రభో। రామకృష్ణా మహాత్మా
ప్రభో। జగత్ తృష్ణా। మహాత్మా। ప్ర॥

1. పల్లెవాసివై పట్నములేలెదు! పుట్టుపేదవై భోగములిచ్చెదు ।
చదువులు లేకయె శాస్త్రము బల్కెదు!
ఎంత మహిమ గలవాడవు తండ్రీ ।

2. పాలదాతి దేవాలయములట । పుష్పరాజముల ఉద్యానములట ।
కోటీశ్వరులే కొల్చు దాసులట । అద్భుతమూర్తివి ఆశ్చర్యముగద

3. విద్యా వాహిని వెలయు జిహ్వకడ
ప్రేమమధువు నీ హృది మాకొసగెడు
కరుణ చంద్రికలు కన్నుల వెల్వడు ।
అనుభవమూర్తివి ఆనందమకవు

## 86

శారద నీ ఘన మంగళ సన్నిధి మనెడు వరము నిడ రావే
ప్రేమ తరంగిణి డోలికలందున తన్మయమొందగ నీవే
ప్రశమిత చిత్త విభూషితవే ప్రమోదిత మానస మూర్తివే ॥శా॥

1. కాలికి గజ్జెలు ఘల్లన మ్రోయగ పదములు లయమున నాడన్
కంఠము గానవిలోలితమై పరమాత్మను నిన్ను నుతింపన్ ॥శా॥

2. జపతప సాధన పూజా సేవల సన్మతి మునిగి చరింపన్
సంతత సంస్మరణామృతమున్ చవి చూడగ బూర్తిగ ద్రావన్ ॥శా॥

3. ధ్యాన సమాధి నిమగ్నమనంబున విస్మృత విషయముతోడన్
అనుభవ సంస్ఫుర సంస్థితిలో విమలాచ్యుత పదవి వసింపన్ ॥శా॥

# 87

భజియింపుడీ శ్రీరామకృష్ణు భజియింపుడీ ॥భ॥

1. భావింపరే మీ హృదయ వాసు ప్రాణాధినాథు ప్రఖ్యాతుని
2. భవ హారుండని భావ విభుండని భువనేశుడు నా ప్రణమిల్లి
   పరిశుద్ధంబగు కరణత్రయితో నిరతిశయంబౌ నిశ్చల మతితో
3. జ్ఞాననిధియు, విస్తార నిస్పృహుని
   శాంతు, గురున్, సాష్టాంగము జేసి
   అనుభవానందుని ఆర్తిని గల్గి అనురాగముతో ఆశ్రయముతో

# 88

దరిశన మీవే శారదామాయీ
   సురవర సంచయ సన్నుత చరణా
   సర్వాధారా ప్రేమ ప్రవాహా సకలాధ్యాత్మిక సాధనగమ్యా ॥ద॥

1. నీ ప్రేమచేగదా జీవుల నిలకడ నీ శక్తిచేగద లోకప్రపోకడ
   నామరూపముల నియతివె గాద నిత్యనవీనవుగా
2. చేతికి జేరువనుండియు నందవు నేత్ర సన్నిధిని నుండియు దోచవు
   ఇంద్రియంబులకు లొంగవుగాద ఇహపర దూరవుగా
3. మనసును నిలిపి లోతును దెలిసి మాయను మాయము జేసినవాడే
   అజ్ఞానంబును అణచినవాడే అనుభవ పరుడౌగా

# 89

వినవోయీ కనవోయీ
   మంగళమూర్తి తపోధనుని గురుమూర్తి తపోధనుని ॥వి॥

1. భవతారిణీమణి కాళిక సతోషు ప్రత్యక్షము సుమ్మా....ప్రత్య....
   "రామా" యనగా బాలరాముడే ముందర నిలచేను ।
   కృష్ణ బిలచిన మోహన మురళి నూదుచు నాడేను ।....
2. తంత్రము, యంత్రము, మంత్రము, యోగము
   కరతలంబౌగా....కర....
   క్రైస్తవమిస్లాం బోధంబనగా నలిగిన పిండేగా ।
   నిర్వికల్పక భావసమాధులు నిత్యజీవనమే.......
3. క్షణిక సుఖంబుల మునిగి యీ పగిది భ్రాంతినుంటేనా ।.......
   శాశ్వతంబగు అనుభవ సుధను వదలి చెడిపోతేనా ।....
   గురువరు, వదలి, చెడిపోతేనా ।

## 90

జయరామవటి వాసినీ, శారదా
జగదాధారిణీ మంగళ ప్రదా ।।జ।।

1. విశ్వకారిణీ విశ్వపోషిణీ విశ్వనాశినీ విశ్వరక్షణీ ।।జ।।
2. శ్యామ రామ తనయే సువినయే
   రామకృష్ణ గురుదేవ పూజితే
   సాధకజన సంపూజితే, జితే
   సత్సమాధి సంలగ్న మానసే ।।జ।।
3. నిగమాగమ సంచారిణీ, జనని
   త్యాగాభరణ సుశోభినీ, ధనీ
   అనుపమ దివ్యానంద ప్రదాయినీ
   అనుభవ హృదయ నివాసినీ, జననీ ।।జ।।

## 91

జ్యోతిస్సాంద్రా శ్రీరామకృష్ణా

సుగమము కాదుకదా నీ ప్రభ సుగమము కాదు కదా ॥జో॥

1. నీ చిరునవ్వుల శశి లీనంబగు నీ కాంతిలొ రవి నిర్గమించు గద

2. నిన్ను జూడ సురనాయకుడే కన్నులు జాలక ఖిన్నత నొంది

కన్నుల నర్థించెన్

వాణీ శేషులు వర్ణింపగ నిను బడలి మూగలై యుంట జూడ

సుగమము కాదుకదా నీ ప్రభ సుగమము

3. అనుభవసుధ సకలావని ముంచగ

మునిగణముల హృదయములుప్పొంగ అనిదంపూర్వముగా

అనిమిష సంతతి ఆనందముతో నిను స్తుతియించుచుంట చూడ

సుగమము కాదుగదా నీ ప్రభ సుగమము

## 92

నిత్య నిరంజనీ నిరుపమ సుఖదా

నిరవధికానందినీ శ్రీ శారదా ॥ని॥

1. నిత్య సత్య స్వరూపిణీ

విమలానంద ప్రదాయినీ

సత్యమోక్ష సంధాయినీ

అఘవినాశిని అమితప్రకాశిని ॥ని॥

2. ఆదిశక్తి ఆనందదాయినీ

అవ్యయానందమగ్న సంతోషిణీ

నిర్మల నిర్వాణ మహదానందినీ

కర్మ వినాశిని కలుషవిదారిణి

3. త్యాగాధివాసినీ మోక్షప్రదాయినీ
భోగాతీత సుసౌఖ్య సంధాయినీ
అమల విజ్ఞాన అమృతదాయినీ
అనుభవైక్య ఆనందరూపిణీ ॥ని॥

## 93

కన్ను విప్పవే నిదుర మాని చూడవే, యింక
మేలుకొనక తమమున ఓ మనసా మునిగి యుందువేనాకో ॥క॥

1. రామకృష్ణ భానుడు ప్రేమ కిరణ చయముతో
అజ్ఞాన తిమిరములను అణచి ఉదయమయ్యెగా
ఓ మనసా మునిగియుందువేనాకో ।

2. కిలకిలా రవములతో జగతి కళకళ ముఖములతో
ఓ మనసా కొల్చుచుంట జూడవే

3. పామరులేనా చూడు పండితులేమైనా
వర్ణమ్మా ! లింగమా ! జాతియా !
కానుపించదుగా వానియర్చనలో ఓ మనసా అనుభవానందమే

## 94

త్యాగమయీ జననీ శారదే
త్రిగుణాతీత ప్రకాశినీ....వరదే ॥త్యా॥
త్రిలోచనీ త్రిపురాధివాసినీ
త్రికరణపావనీ త్రితాపవారిణి ॥త్యా॥

1. భాష్యత్రయ ప్రకాశినీ సత్తాత్రయవిభాసినీ
భావత్రయ విహారిణీ తత్త్వత్రయ స్వరూపిణీ

భేదత్రయసంహారిణీ కాలత్రయ సంవేదినీ
శక్తిత్రయ సంసేవినీ దోషత్రయపరిహారిణీ ॥త్యా॥
2. నేత్రత్రయ సంధారిణీ జీవత్రయ సంచారిణీ
నాడీత్రయ సంచర్శినీ మూర్తిత్రయ పరిపా...
యోగత్రయ సంచారిణీ అవస్థాత్రయ సా...
త్యాగప్రియసంతోషిణీ అనుభవజన సమో ॥త్యా॥

## 95

ప్రాపుగదా మా ప్రాపు గదా ॥ప్రా॥
1. చంద్రునింకపై చల్లదనమును
సుధను మించిన మధురత్వము గల
పదపద్మమ్ముల మాత శారదే
2. ప్రేమకు ప్రేమను పంచి యొంగెడు
పరమ పవిత్రతె పరిచారిక గల
భగవాన్ గురు శ్రీరామకృష్ణుదే
3. ఆత్మ దీప్తులతో అద్వితీయులై
అనుభవ ప్రభలతో అనందులునౌ
రామకృష్ణ శ్రీ శారదలే మన

## 96

శారదమాయీ జ్ఞానప్రదాయీ
సాదరమున మమ్ము దయజూడు మా. ॥శా॥
1, విశ్వ మానవ ప్రేమ నీ యాదర్శము
విమలానందమే నీ సాదృశ్యము

1. జగజ్జననీ ఆనందదాయినీ
జననరహిత మోక్షప్రదాయినీ
2. శమదమాదిగుణ శోభితే సుశోభితే సంశోభితే
శరన్నవరాత్ర పూజితే సుపూజితే సంపూజితే
సకల సచ్ఛాస్త్ర వేదితే సువేదితే సంవేదితే
మహాయోగినీ సేవితే సుసేవితే సంసేవితే
3. దుష్ట సంస్కార నాశినీ వినాశిని ప్రణాశినీ
శిష్ట సంస్కార పోషిణీ సుపోషిణీ పరిపోషిణీ
అనుభవ జన హృద్వేదినీ సంవేదినీ సువేదినీ
త్యాగమోక్షఫలదాయినీ ప్రదాయినీ సంధాయినీ

## 99

లేలెమ్మా। మేల్కొనుమా। వెర్రిచిత్తమా।
శ్రీరామకృష్ణుడదే ఎదుట నిలచియున్నాడే
పాలింపనున్నాడే
1. లోకములో సర్వగురుల మించినవాడే
ప్రేమమూర్తి యనగ గీర్తి గాంచినవాడే।
త్రికరణముగ శరణు బొంద బ్రోచెడువాడే।
శ్రీరామకృష్ణుడదే ఎదుట నిలచియున్నాడే।
పాలింపనున్నాడే
2. లింగ భేదమంచు బుద్ధి వెదకిన లేదే।
ధనముబట్టి తారతమ్య మెంచుట లేదే।
పండితులనె చేరదీయు పద్ధతి లేదే।
శ్రీరామకృష్ణుడదే ఎదుట నిలచియున్నాడే

3. అఖిల సాధనమ్ములందు నారితేరెనే।
అనుభవానందమందు మునిగి యుండునే।
అనుపమ మాతాజీ యంచు బేరుబొందెనే।
శ్రీరామకృష్ణుడదే ఎదుట నిలచియున్నాడే
పాలింపనున్నాడే ।

## 100

భవహర। గురుదేవా। ప్రభువరా। భయరహితా। దేవా।
వరగుణగణనిధి రామకృష్ణా ॥భ॥

1. పరమ పవిత్రా పతిత సుమిత్రా భారత మాతృ ప్రఖ్యాత పుత్రా
2. నీ యాదర్శము నిరుపమమౌగా। నిఖిల జనారాధ్యా।
పూర్వాధునములభువి సనంస్కృతుల నన్వయపరచు ననంతహృదయా
3. దేవా। అగణిత దేవ స్వరూపా। దివ్యప్రభా శోభా।
అనుభవమూర్తి అద్భుత శక్తి। అసముడవౌదువచింత్య దేవా

## 101

ఎచ్చోట నున్నావురా ఓ దేవ ఏరీతి నున్నావురా
ఏనాడు నిన్ జేరుటో ఏరీతి సుఖమొందుటో ॥ఎ॥

1. బ్రహ్మంబవంచు గుణాతీతవంచు వాఙ్మానసాతీతమౌ ఆత్మవంచు
సర్వేంద్రియాతీత తత్త్వంబవంచు శాస్త్రిలు ఘోషించురా ఓ దేవ
2. సృష్టించు మూర్తి విధాతవె నీవో పోషించు శ్రీమహావిష్ణుండవీవో
సంహారమున్ జేయు రుద్రుండవీవో బోధించి వివరింపరా ఓ దేవ

3. సర్వాని ధాధార శక్తివే నీవో సాక్షాత్తు అనుభవానందంబవీవో
కైవల్యమీవో విమోక్షంబవీవో కారుణ్యమును వెల్వరా ఓ దేవ

# 102

శాంతినిధానా శ్రీరామకృష్ణా
సమరసహితానందరసలోల నిష్ణా విషయ వితృష్ణా ॥శాం॥

1. సుగుణాకర శ్రీకర కరుణాకరా సుప్రభాకర శంకర క్షేమంకరా
సుజ్ఞానాంబరా చిన్మయసాగరా నిను నిత్యము గొల్తుర త్రిపురేశ్వరా

2. లోకభూషణ తోషణ సంతారణా నిఖిలాధ్యాత్మికానంద సంపూరణా
జగదుద్ధారణా తత్త్వ విచారణా నిను నమ్మితి సల్పర సంరక్షణా

3. ద్వైతాద్వైత సిద్ధాంత పరమావధీ శుద్ధాత్మైకసాధన సంపన్నధీ
అనుభవ పెన్నిధీ ఆనందాంబుధీ నిను వీడగజాలర హృత్ సారధీ

# 103

స్మరియించెద నీ కథ మదిలో సకలాగమతత్త్వనిధానా ॥స్మ॥

1. ఆజన్మంబుగ నతుల విరాగము ఆత్మజ్ఞానము అద్భుత మహిమ
కలిగి వెలంగిన కల్పకమీవే కానను నీ సములేరీ దేవా

2. సాధనసంపద సాధన తతులు శాస్త్రజ్ఞానము సరళపు బోధ
సమరసతత్త్వము సర్వాదర్శము చాలను గాంచగ నిలలో దేవా

3. అవని దరింపగ నమరత్వమనో ఆత్మానందపుటాదర్శమవో
అనుభవానందామృత నిధివో అందవు తెలియగ నిజము దేవా

## 104

చూపింపరా మోము జూపింపరా చూపింపరానట్టి చూపంబురా ॥చూ॥

1. కలలోనైనను ఘటిపవగ లేరా కమ్మని కాంతుల జిమ్మునురా
2. దోషాలను దరి రానీయకురా దుఃఖాలన్నిటి ద్రోలుమురా
   లోకవాసనల మరపింపుమురా నీ విడు శాంతిని గురుదేవా
3. శాస్త్రాలకు వెలి ప్రవహింపుమురా సాధనలన్నియు వర్ణనమౌరా
   ఆ పరమరూపము కనిపించుమురా ఆనందముగా గురుదేవా

## 105

కృష్ణా నీ పాదములే కొల్చి వేడెద రామ....

1. కల్పవృక్షమువలెను గనిపెట్టుకొని యుంటి
   కన్నడ సేయకిక కాపాడుమో రామ
2. నీదు చారిత్రమ్ము అత్యద్భుతము దేవ
   పృథ్వి కాపాడుటకు అవతరించిన రామ
3. మత్స్యరూపము దాల్చి మహాత్మ్యమున్ గలుగు
   వేద విజ్ఞానమును వెదజల్లు శ్రీరామ
4. కూర్మమై జన్మించి సముద్రమంథన మిచ్చి
   అమృతము నొసగిన అమరేంద్ర శ్రీరామ
5. వరాహావతారమున ధరణి కాపాడుచును
   పరవిద్య చాటించు పరమపావన రామ
6. నరసింహరూపమున హరిభక్తి బోధించి
   నరులకును విశ్వాస మంత నేర్పిన రామ
7. వటుడు వామనుడవై బలిదానమును జాటి

వరదాన మహిమంబు బ్రకటించు శ్రీరామ

8. పరశురాముడవౌచు మూర్ఖరాజుల ద్రుంచి
హరి గొల్చునవకాశ ముర్వి జేసిన రామ

9. రామచంద్రుడవగుచు రమ్యకర్మపథంబు
నేర్పుగా నరులకై నెరుగ దెల్పిన రామ

10. కృష్ణావతారమున వృష్ణికాంతల భక్తి
తృష్ణ ప్రకటించి సద్భక్తి జూపిన రామ

11. బుద్ధ స్వరూపమున శుద్ధ సుజ్ఞాన సుధ
బద్ధ కంకణుడవై పంచిబెట్టిన రామ
కల్కిమూర్తిగ రామకృష్ణ దేవుడవై య
ఖండమౌ యనుభవానందమిచ్చిన రామ

## 106

గదాధర బ్రోవరా ఓ కరుణామృత సాగరా దేవా

1. అగణిత సంఖ్యా గుణగణ విభవా అతుల ప్రేమాకారా దేవా
2. సకలాధ్యాత్మిక సార నిమగ్నా సంసృతి లతికా భగ్నా
దేవదేవిగణ రూప సులగ్నా కేవలాత్మ ! భవ బంధన విఘ్నా
3. దశవిధరూపా సత్యస్వభావా వినిర్మలా గురుదేవా,
అనుభవపూరిత తత్త్వప్రభావా ఆర్యా!సంస్తుతకీర్తి ప్రాభవా

## 107

వరదా ! పరమేశ్వరా !
పరమ దయాకర ! శ్రీ గదాధరా ! ॥వ॥

1. ప్రేమ సృజించీ పెంచి లయించీ
భక్తుల బ్రోచెడు ప్రేమనిధానా
నీ కృప లేనిదే జగములకేగతి
నిర్మలచరితా ! దేవా ! కృపాళూ ! ॥ప॥

2. మానవువోలె పుట్టినమాత్రన
భక్తునిరీతిగ నాడినమాత్రన
కానమె నీదు ఈశ్వర గుణముల
శక్తి సమేతా ! దేవా ! కృపాళూ ! ॥ప॥

3. అఖిలము నిన్నే సతము భజించు
అంతట నీవే సతము చరింతువు
అనుభవమందున నీవెగ నుందువు
అతుల ప్రభావా ! దేవా ! కృపాళూ ! ॥ప॥

## 108

ప్రేమరూపమా సద్ధర్మకేంద్రమా
పరమహంసమా శ్రీరామకృష్ణమా

1. సకల దేవతా సురుచిర రూపమా
సాధకజన మనో ప్రబోధమా ॥ప్రే॥

2. శాంతి కిరణమా ముక్తినిలయమా
వేదవేద్యమా జ్ఞానపుంజమా
మోక్షరూపమా కరుణా నిలయమా
మతసామరస్యమా సకలాధర్శమా ॥ప్రే॥

3. ధ్యాన ధ్యేయమా జ్ఞానసీయమా
జ్ఞాన సాధ్యమా ప్రజ్ఞా నిలయమా

యోగగమ్యుడా అమృత రూపమా
త్యాగ స్వరూపమా అనుభవానందమా ॥ప్రే॥

## 109

భజ రామకృష్ణం భజ రామకృష్ణం
భజ పరమహంసం విషయ వితృష్ణం ॥భ॥

1. చంద్రామణీ పుత్రం రమణీయ గాత్రం
సద్గుణ గణసాంద్రం ప్రజ్ఞా సముద్రం ॥భ॥

2. క్షుదీరాము పుత్రం పతిత సుమిత్రం
సకలధర్మమత తత్త్వమూలకేంద్రం ॥భ॥

3. భవతరణీపుత్రం విదిత సకల శాస్త్రం
విదితాధ్యాత్మిక బుధజన పాత్రం ॥భ॥

4. పరమ పవిత్రం సాధకమిత్రం
త్యాగసుశోభిత అనుభవచంద్రం ॥భ॥

## 110

ఎందుకోయి యీ తిరుగుట? మందమతి వోలె?
ముందుండెడు పెన్నిధిని అందుకొనగలేవా అందుకొనగలేవా ॥ఎం॥

1. జనియించిన నాటినుండి తన కాళిని వీడలేక
కనుల నీరు ప్రవహింపగ కనిన శిశువు రీతిన్ కనిన....
జనని జేర నేడ్చి ఏడ్చి తనుమనముల బూర్తిసురిచి
కనజాలని కాళిక దర్శనము నొందినాడు దర్శన...,

2. అమ్మనుగా స్త్రీలనెల్ల నంతయు నా కాళికగా

అతడు గాంచినాడు సమ్మోదము నొందినాడు ముదము....
అతడివొక యాదర్శము అద్భుతమగు అనుభవము
అట్టివాని గనరా మా రామకృష్ణ దేవున్
మనరామకృష్ణదేవున్

## 111

జనమే శోభాయమానము శ్రీరామకృష్ణ గను ॥ది॥

1. నీ నామామృత ధార పానోన్మత్తత పరమ
   జ్ఞానోద్రేకజ సమాధిని జెందేటి దినము
2. సర్వ ప్రాపంచిక సుఖ సందోహములనెల్ల
   శరణుజొచ్చుచు నీకు సర్వార్పణంబు సేయు
3. నీదు భక్తుల జేరి నిర్మల చిత్తవృత్తి
   నీదు చరితాబ్ధివిహారాదుల సల్పజాలు
4. భారములన్నిటికిని బాధ్యుడవీవటంచును
   భావించి నిర్భయంబుగ వర్తించునట్టి మహిత
5. జననమరణ క్లేశజాలము సంహరించి
   అనుభవానందముల జనవున మాకొసంగు

## 112

రామ బోల్, కృష్ణ బోల్ రామకృష్ణబోల్
శ్రీరామకృష్ణ హరి జయ జయ బోల్ ॥రా॥

1. రామకృష్ణ పద తామరసోద్భవ సోమపాన విభవమ్మున మున్గుచు
2. అనుపమశక్తి సమన్విత వృత్తిని
   గురుతర నిశ్చయ గుణముల గల్గుచు

3. ఇహపరార్థ ఫల రహిత విరక్తిని
సోహమ్మని సదా బ్రహ్మముదలచుచు
4. అనుభవానంధామృతసాగర హాయి విహారములందు దేలుచు

# 113

రామకృష్ణునకు నమోనమస్తే
అమ్మ శారదకు నమోనమస్తే ॥రా॥
కామరహితులకు నమోనమస్తే
బ్రహ్మతేజులకు నమోనమస్తే

1. ధర యజ్ఞానములో బడిపోవగ మరుమరీచిలో జీవులు సమయగ
చూచి చూచి మది సంక్షోభించి చాచి చేయి భువి రక్షించిన మన
2. కామారిపుష్కర జయరామవటుల
బ్రాహ్మణ వంశములందు జనించి
బాల్యమునుండియు దేవవిభూతుల లీలామయులై ప్రకటించిన శ్రీ
3. వాణీ బ్రహ్మలె, లక్ష్మివిష్ణులె, పార్వతీశ్వరులు వీరలె యనగ
దివ్య శోభత తేజోమయులై అవని దరింపగ జేసిన మన శ్రీ
4. అస్ఖలితంబగు బ్రహ్మచర్యమున అమానుషంబగు తపోనిమగ్నత
అద్వితీయమగు అనుభవకోటితో ఆదర్శంబుగ వెలుగొందిన శ్రీ
5. దేశదేశముల నాకర్షించి దేవతలనె తమలో లయపరచి
పరాశక్తిమున ప్రపంచమంతట వేదాంతానుభవంబు జాటిని
6. అగోచరంబగు శక్తిరూపులై అఖిలలోకముల నావరించుచు
భక్త సంతతికి ముక్తినొసంగిన ప్రతిభామూపులు దేవదేవులగు
7. అనుభవానందములనగానేమో ! ఆధ్యాత్మికసుధ గ్రోలుటదేమో
వేదార్థంబును తెలియుటదేమో ! విశదము జేసిన పరమ పావనుల

## 114

ప్రాపుగదా మా ప్రాపుగదా ॥ప్రా॥

1. చంద్రునికంటె చల్లదనమును
సుధను మించిన మధురత్వము గల
పదపద్మమ్ముల మాత శారదే

2. ప్రేమకు ప్రేమను బంచి యొసంగెడు
పరమ పవిత్రతె పరిచారికగల
భగవాన్ గురు శ్రీరామకృష్ణునే

3. ఆత్మ దీప్తులతో అద్వితీయులై
అనుభవ ప్రభలతో ఆనందులునౌ
రామకృష్ణ శ్రీశారదలే మన

## 115

సుఖమన వినవే శాంతిని గనవే
చపలత వలదే మనసా చపలత వలదే ॥సు॥

1. సాధనావతారమని సాక్షాత్తు శంకరుడని
సత్కీర్తిగన్న శ్రీరామకృష్ణు సేవజేయుచే

2. ప్రేమకునాదర్శము భక్తికి నిధానము
పవిత్రమాత శ్రీశారదను పూజసేయుచే

3. జ్ఞానమున సాగరము ధ్యానమున పర్వతము
ఐన వివేకానందు పథమును అనుభవించుచే

## ౧౧౬

విశ్వనాథసుత నమో నమో జయ
    వివేక మునివర నమో నమో ॥వి॥

౧. విశ్వారాధ్యా వివేకచంద్రమా
    విమల విజ్ఞాన పరమహంసమా ॥వి॥

౨. రామకృష్ణపదకమల సుభృంగా
    మోక్షవిహారకబంధ విభంగా
    రామకృష్ణగురు ప్రియశిష్యవర
    ముముక్షుజనసందోహ ప్రియంకర ॥వి॥

౩. యోగివర్యా, అవతార వరేణ్యా
    త్యాగప్రబోధిత గురువరేణ్యా
    అఖిల తత్త్వ మత సార ప్రపక్తా
    అనుభవ విదిత ప్రశాంత సుతృప్తా ॥వి॥

## ౧౧౭

వందనంబుల గైకొనరారా నందదాయకా
    నందబాలకా రఘునందనా ప్రభూ
    సుందరానన వందిత చరణార వింద నేత్ర నిశ్చింత మానస

1. అమ్మ శారద అన్న వివేకానందులన్ గలిసి
    నంది దేవునితో గరుడుడందముగ రాగ
    శిష్యులచే బరివేష్టింపబడి సేవకజన సంసేవల గొనుచు

2. భాస్వరంబగు పూర్ణానుభవ వైభవంబున
వైభవంబున నతి ప్రాభవంబున
రాజాధిమహా రాజులకైన రాని, లేని మహా రాజతీవితో

3. సర్వవిశ్వము సాగిలపడగా శాశ్వతోన్నతిన్
శాశ్వతోన్నతిన్ నికర సత్య సంస్థితిన్
అనుపమశీలగ నద్భుతమలరగ అనుభవానందంబె వర్షింపగ

## 118

శ్రీశారదాదేవి సేవింతుమమ్మా
శ్రితభక్త జనపాల చేమోడ్తునమ్మా ॥శ్రీ॥

1. నీతోడ నుండుటే నిజము సాలోక్యంబు
నీ సన్నిధే నాకు అసలు సామీప్యంబు
నీ బోధ నమృతమా, సాయుజ్యమేగదా
సాటి నా ముక్తిగా జోహారులమ్మా జోహారులమ్మా

2. శాంతమున గీర్తింతు సాగిలుదు దాస్యమున
చెలిమితో భావింతు శిశువుగా ప్రేమింతు
సంపూర్ణ భారంబు నీకె యర్పింతునే
నిన్ను బూజింతునే జోహారులమ్మా జోహారులమ్మా

. అనుపమానంపైన అనురాగ దృష్టితో
అవ్యయంబగు ప్రేమ ఆదరింపగదే
అచలమై, అతులమై, అనుభవానందమై
అలరారు నీకిదే జోహారులమ్మా జోహారులమ్మా

## 119

వందే గురుచరణం భవహరణం వందే గురుచరణం ॥వం॥

1. పతిత పావనం పరమ పవిత్రం సురగణ వందిత నిర్మలరూపం
   శారదాది యంబురుహ స్థానం సర్వభక్త మధుపాశ్రమోత్తమం
2. జన్మకర్మ విలీన కారణం చంద్ర సూర్య తేజో విభాసితం
   అజ్ఞానాంధ వినాశక తేజం సుజ్ఞాన సుప్రసాదమవర్ణ్యం
3. బ్రహ్మైక్యాబ్ధి విభుతి ప్రదాతం అనుభవానందామృత పాదం
   పరమావధి సుప్రాభవ యోగం అనంతమవ్యయమఖండరూపం

## 120

నమస్తే మాతాజీ నమో శారదాంబా ॥న॥

1. సారహీన సంసార జలధిలో మున్గి దుఃఖముల బొందెడు దీనుల
   ద్వంద్వ తరంగములన్ దరింపగా నీవె గావె పెను నావ ఓ జననీ
2. గగన నగరి నా గ్రాలు లోకమున శాంతి నెలవుకై సంచరించుచు
   అలసి గాసిలెడు అజ్ఞ జీవులకు
   నీవె యాశ్రయము నిత్యము జననీ
3. జ్ఞాన శూన్యమగు నంధకారమున దారి గనక వేతనలనొందుచు
   అనుభవంబు గన లేనివారలకు నీవె చల్లనగు దీప్తివె జననీ

## 121

నమో ! నమో ! గురుదేవ ! పరాత్పర ! నమో పరమహంసాచార్య
నమో ! సగుణనిర్గుణ రహితాత్మా !
నమో ! రామకృష్ణ ! త్రిభువనపాలా !

1. నమో ! నమో ! మహామాయి ! శారదా !
నమో ! వివేకానందప్రభూ !
నమో ! బ్రహ్మానంద శారదానంద
నమో ! ప్రేమానంద, తురియానంద
2. నమో ! అభేదానంద, అఖండానంద
నమో ! రామకృష్ణానంద
నమో ! యోగానంద. నిర్మలానంద
నమో ! శివానంద, అద్భుతానంద
3. నమో ! సుబోధానంద, నిరంజనానంద
నమో! త్రిగుణాతీతానంద
నమో ! అద్వైతానంద, విజ్ఞానానంద
నమో ! అనుభవానంద, అద్భుతమూర్తి

# 122

నమః యనుచు మ్రొక్కరే నమ్రతతో శారదమ్మకు
కోమల పదముల తల్లికి గురుతర గుణముల వల్లికి
కళకళకాంతుల కల్కికి కేవల బ్రహ్మమ్మునకును
1. భక్తుల నిల బ్రోవగా బ్రహ్మపదము బ్రక్కనుంచి
ప్రేమలొలుకు వదనముతో పావనమగు హృదయముతో
భాస్వరమగు నవ్వులతో బ్రోవ నవతరించు తల్లికి
2. కోరుటయే తడవుగా కోటిభాను దీప్తులతో
కామాదుల నణయించుచు కోరికలను నెరవేర్చుచు
కమ్మని పల్కుల బల్కుచు కామితముల నిచు తల్లికి

3. అనయము మన నీడగ వెనుక ముందు చనుచునుండి
మానవులకు దూరమైన అనుభవానందంబుల
మనకొసంగి రక్షించెడు జనని శ్రీ శారదమ్మకు

## 123

ప్రణుతి, ప్రణుతి శుభాకరా ప్రణుతి, సర్వగుణాకరా !
ప్రణుతి, శారద రామకృష్ణా ! ప్రణుతి, తేజోభాస్కరా !

1. బ్రహ్మవిద్యాసాగరా ! బ్రహ్మతత్త్వవిశారదా !
బ్రహ్మ విష్ణు రుద్ర రూప । బ్రహ్మమౌ పరబ్రహ్మమా ।

2. శరణు, శరణు జగద్గురో । శరణు శరణు జగత్పితా -
శరణు, ఆశ్రితభక్తపాలక । శరణు, అనుభవానందమా ।

## 124

జనని శారద ప్రణతులమ్మా స్మరణ సేతుము నిత్యమమ్మా
కరుణ జాలన సేయుమమ్మా.... జ్ఞానమయివమ్మా ॥జ॥

1. జగతి గాంచిన కన్నతల్లివి జీవ జగతికి గల్పవల్లివి
జనన సంసృతి కెల్ల నెల్లవు సకల గుణవతివి.... జనని .... జ్ఞాన
జ్ఞానమయివమ్మా.... జ్ఞాన....

2. అసమురాలవు మనన దూరవు అనుభవానందైక వేద్యవు
అగమార్థ విభూతి హృదయవు అఖిల తత్త్వమవు... అగమార్థ....
జ్ఞానమయివమ్మా.... జ్ఞాన ...

## 125

జోహార్ ! జోహార్ జోహార్ పరమహంస గురు మహరాజ్ ॥జో॥

1. మహాదేవ శరణు సద్గురు మహితాత్మా శరణు
   శరణు శరణు యని నిరతము నిన్ మదికోరెద వేడెద కరుణాకర॥
   మూర్తి త్రయసారా దేవ ముల్లోకాధారా
   మురిపెముతో నను జేరదీతువని
   మ్రొక్కెద నెప్పుడుంమురుపకురా
2. ఆశ్రితజనపాలా అహా అద్భుత గుణశీలా
   అనుదినమును నిను జనకుడవంచును
   మననము చేసెద ననుభవానందా

## 126

అమ్మా నీకిదె జోహారు అఖిలము ప్రేమమయంబు జేసిన ॥అ॥

1, అమలంబైన జీవితంబుచే అతులాదర్శము నీదమ్మా
   గార్హస్థ్యంబున సన్న్యాసంబున గాంచలేము నీ సములమ్మా
2. గురుదేవుని పద జాడలనే గొని గురుతరరీతిని మనితమ్మా
   సాధకులంతా "జై" జై యనగ సద్గురు పీఠము నీదమ్మా
3. భక్తి జ్ఞాన విరాగంబులలో ప్రబల నిదర్శనమీవమ్మా
   ద్వైతా ద్వైతపుటనుభవంబుల నిత్య నిమగ్నత నీదమ్మా

## 127

కోటికంఠముల గూర్చి జై యనుచు బాడుదు శ్రీ రామకృష్ణునకు
   సాటిలేని గురుదేవునకు సర్వశక్తియుత స్వాంతునకు
   సరగున బాడుడు జై జై జై

1. ఆనందంబుగ నాట్యము సల్పుచు తన్మయతాబ్ధిని మున్గుచును
అత్యద్భుత ప్రభాశీలునకు శిష్యపరివృత మూర్తికిని
అందరు పాడుడు జై జై జై

2. అన్యోన్యంబుగ నందరును మన అనంతలీలా లాలసుని
అఖండతేజో భాస్కరుని అనుభవానంద సాగరుని
గానము చేయుడు జై జై జై

# 128

శారదా నీకిదే జోహారు కారుణ్య దేవతా జోహారు ॥శా॥

1. శ్రీరామకృష్ణునకు ప్రేష్ఠదైవంబవై
పోల్చగా రానట్టి పురుషుగా జేసితివి

2. ఆధ్యాత్మికంబుగా యోగ్యులే స్త్రీలంచు
ఆడవారికి లక్ష్యమవవి నిల్పెడితల్లి

3. నీ ప్రేమ నీ జ్ఞాన వైరాగ్య సంపదల్
వర్ణింప సాధ్యమే నిర్మలాంతఃకరణ

4. నీ యనుభవానంద నిధులలో రవ్వంత
నిరుపేదనగు నాకు నియ్యవే మాతాజీ

# 129

జయ । రామకృష్ణా । ప్రతిభారూపా । జయ । జయ । గురుదేవా
సర్వశ్రేష్టా । సర్వాధారా । సురవరనుత చరణా । కరుణా
జయ జయ ॥జ॥

1. భారతమాతృ భాగ్య జ్యోతీ పరమ పావన ప్రస్ఫుటకీర్తి
పరతత్త్వాంబుధి ।- వ్యాపకశక్తి వరగుణగణమూర్తి ।....
జయ జయ

2. వేదాంతామృతాస్వాదన జనితా మధురానుభవానంద విభవా ।
విద్యాలయ విశ్వేశ్వర । దేవా ! ప్రేమావతార। మాం పాహి,
జయ జయ

# 130

జయమో మాతా సౌఖ్యప్రదాతా జయము శారదామాతా....
సకలాగమనుత శక్తిత్రయ స్థితా శాంతం శివమద్వైతా.... ॥జ॥

1. జయ కేతనమను శాంభవి వేయగ చక్రి శంఖమును నూద........
జయము జయము నా భవుడు భేరి మ్రోయ
స్రష్ట సామములు బాడ
శారద లక్ష్మిలు హారతి నెత్తగ
సర్వవిశ్వములు కొలువ

2. అతుల విభూతితో అనుపమ దీప్తితో
అద్వితీయమగు నానందముతో
**అఖిలము నీవై అన్నిటిమీదై**
అనుభవానంద నిధానా

# 131

కీర్తించెద దేవా।....కీర్తించెద దేవా
కాళికతనయా నిను గీర్తించెద ॥కీ॥

1. సాష్టాంగ మొసగిజయ నా 'జై' ధ్వానములతో
   జయః జయః జయః జయః జయ మహాత్మయని
2. నీ మహిమ జూచి నతితో నీ వెలుగు గాంచి
   శుభము, శుభము సదా శుభము దేవ యని
3. పాదాలకొరిగి అనుభవ వాక్యాల నడచి
   మంగళమగు జయ మంగళాధిపతి

## 132

శ్రీ సచ్చిదానంద చిన్మయ రూపం
   శ్రీరామకృష్ణం శిరసా నమామి
      దీనమందార శ్రీ దివ్య ప్రభావం ॥శ్రీ॥

1. శ్రీచంద్ర వరబాల శ్రీఖుది తనయం
      భవతరణీ ప్రియ భావ విదూరం ॥శ్రీ॥
2. శారద ప్రియనాథ సద్గురు దేవం
      శ్రీనివాసపాల ధనినుత పాదం ॥శ్రీ॥
3. త్రిలోకవందిత శ్రితజనపాలం
      సర్వకళాపూర్ణ సౌందర్యరూపం ॥శ్రీ॥
4. పండిత విజ్ఞాన భావాతీతం
      హాస్యానంద మహాద్భుత ప్రజ్ఞం ॥శ్రీ॥
5. సజ్జన పరిపాల సన్నుత చరణం
      తీవ్రాధ్యాత్మిక తత్త్వప్రపూర్ణం ॥శ్రీ॥
6. సారరహిత సంసార విదూరం
      నిత్యసమాధి సంయుక్త ప్రభావం ॥శ్రీ॥

7. అఖిలాధ్యాత్మిక అనుభవమూర్తిం
   సర్వోపనిషదర్ధ సంపూర్ణభాష్యం ॥శ్రీ॥

8. నిఖిలావతార వినిర్మల రూపం
   వివేక వందిత విఖ్యాత చరణం ॥శ్రీ॥

9. విశ్వవ్యాపక విస్పష్ట తేజం
   అత్యంత మాధుర్య అనుభవానందం ॥శ్రీ॥

## 133

అఖిలాండేశ్వరి జగదంబా అవ్యయరూపిణి శారదాంబా
అమృత ప్రదాయిని జగదంబా అభయమొసంగవె శారదాంబా

1. అజ్ఞాన వినాశిని జగదాంబా విజ్ఞాన స్వరూపిణి శారదాంబా
   ప్రజ్ఞాన ప్రదాయిని జగదంబా అభయమొసంగవె శారదాంబా

2. అమల స్వరూపిణి జగదంబా ఆత్మానందిని శారదాంబా
   అనుభవ వందిని జగదంబా అభయమొసంగవె శారదాంబా

## 134

ధర్మోద్ధారక జగద్గురో
శ్రీరామకృష్ణా నమో నమో

1. ధర్మస్వరూపా జగద్గురో
   శ్రీరామకృష్ణా నమో నమో

2. వివేకయతినుత జగద్గురో
   శ్రీరామకృష్ణా నమో నమో

3. అనుభవానందా జగద్గురో
   శ్రీరామకృష్ణా నమో నమో

4. ఓం నమో భగవతే శ్రీరామకృష్ణాయ
ఓం నమో భగవతే శ్రీరామకృష్ణాయ

## 135

శ్రీత్రిపురసుందరీ ఉమామహేశ్వరీ
ప్రేమామృతలహరీ శ్రీశారదేశ్వరీ ॥శ్రీ॥

1. మాతృస్వరూపిణీ మనో ప్రబోధినీ
మమకార నాశినీ శ్రీశారదేశ్వరీ ॥శ్రీ॥

2. తాప ప్రణాశినీ తత్త్వప్రదాయినీ
తపో ప్రకాశినీ శ్రీశారదేశ్వరీ

3. జీవ స్వరూపిణీ దీనార్తరక్షిణీ
భవబంధ మోచనీ శ్రీశారదేశ్వరీ

4. త్యాగస్వరూపిణీ త్రిలోకవందినీ
త్రిపురాధి వాసినీ శ్రీశారదేశ్వరీ

5. గీర్వాణ రూపిణీ గిరిరాజ నందినీ
నిర్వాణ దాయినీ శ్రీశారదేశ్వరీ

6. శాస్త్ర ప్రకాశినీ శక్తిప్రదాయినీ
శాంత స్వరూపిణీ శ్రీశారదేశ్వరీ

7. నంద ప్రదాయినీ ఆనంద వర్షిణీ
మందస్మితాననీ శ్రీశారదేశ్వరీ

8. దయాస్వరూపిణీ దివ్యాత్మ దర్శినీ
దుష్కర్మనాశినీ శ్రీశారదేశ్వరీ

## 136

1. రామనమో కృష్ణనమో జయ రామకృష్ణ గురుదేవ నమో
రామ, కృష్ణ, శివ శక్తి స్వరూపా రామకృష్ణ గురుదేవ నమో
2. అయోధ్య వాసీ రామ నమో గోకులవాసీ కృష్ణ నమో
సాధకజన హృదయాంతర వాసీ రామకృష్ణ గురుదేవ నమో
3. కౌసల్యాసుత రామ నమో దేవకి నందన కృష్ణ నమో
చంద్రామణి సుత లోక విఖ్యాత రామకృష్ణ గురుదేవ నమో
4. రావణ మర్ధన రామ నమో కంస విమర్దన కృష్ణ నమో
కామ క్రోధ భయ పాప విమర్ధన రామకృష్ణ గురుదేవ నమో
5. కోదండధారి రామ నమో మురళీధారీ కృష్ణ నమో
భవనాశన దివ్యామృత ధారీ రామకృష్ణగురుదేవ నమో
6. ధర్మస్వరూపా రామ నమో జ్ఞానస్వరూపా కృష్ణ నమో
ధర్మ జ్ఞాన సుసమన్వయ రూపా రామకృష్ణ గురుదేవ నమో
7. సీతావల్లభ రామ నమో రాధా వల్లభ కృష్ణ నమో
సమాధిసంయుత పరమ హంస శ్రీరామకృష్ణ గురుదేవ నమో
8. భక్తిప్రదాతా రామనమో ముక్తిప్రదాతా కృష్ణనమో
భక్తి ముక్తి సమన్వయదాతా రామకృష్ణ గురుదేవ నమో
9. మునిజన పాలక రామ న సజ్జనమో పాలక కృష్ణనమో
సంసారత ప్తజన పరిపాలక రామకృష్ణ గురుదేవ నమో
10. దుష్ట వినాశక రామ నమో దుష్కర్మ వినాశక కృష్ణనమో
దుష్ట సంస్కార చిత్త వినాశక రామకృష్ణ గురుదేవ నమో
11. మారుతి సేవిత రామ నమో అర్జునసేవిత కృష్ణ నమో
వివేకమునివర సంసేవిత శ్రీ రామకృష్ణ గురుదేవ నమో

12. సత్యనిరత శ్రీరామ నమో త్యాగనిరత శ్రీకృష్ణనమో
సచ్చిదానంద అనుభవవందిత రామకృష్ణ గురుదేవ నమో ॥రా॥

# 137

1. కాళికా ప్రసన్నహృదయ రామకృష్ణ పాహి మాం
కామదూర ప్రేమరూప రామకృష్ణ రక్ష మాం
2. సర్వదేవ దేవిరూప రామకృష్ణ పాహి మాం
సర్వమతసమత్వరూప రామకృష్ణ రక్ష మాం
3. శారదా సుశిక్షక గురు రామకృష్ణ పాహి మాం
సాధకజన హృదయతోష రామకృష్ణ రక్ష మాం
4. వివేక మౌని వందితపద రామకృష్ణ పాహి మాం
విశ్వవంద్య విమల చరిత రామకృష్ణ రక్ష మాం
5. అనుభవ ఆనందనిలయ రామకృష్ణ పాహి మాం
అఖిలజీవ మోక్షదాత రామకృష్ణ రక్షమాం
6. త్యాగ హృదయ సుప్రకాశ రామకృష్ణ పాహి మాం
శోకమోహ దురిత నాశ రామకృష్ణ రక్ష మాం

# 138

1. చంద్రామణిసుత ఆనందదాతా రామకృష్ణా నమో నమో
యుగావతారా వేధాంతవేద్యా రామకృష్ణా ..........
2. శాస్త్రవిదూరా జ్ఞానప్రదాతా రామకృష్ణా ..........
శక్త్యారాధకా శాంతిప్రదాతా రామకృష్ణా ..........
3. శారదారాధ్య ధ్యానమూర్తీ రామకృష్ణా ..........

సాధకాదర్శ సమరసరూపా రామకృష్ణా ............
4. వివేకవందిత విజ్ఞానమూర్తీ రామకృష్ణా ............
విద్యాగర్వ వినాశకమూర్తీ రామకృష్ణా ............
5. అవతారవంద్య త్యాగస్వరూపా రామకృష్ణా ............
అనుభవరూపా మోక్షదాయకా రామకృష్ణా ............

# 139

రామ బోల్ కృష్ణ బోల్ రామకృష్ణ బోల్
రామ కృష్ణ రూప శ్రీరామకృష్ణ బోల్ ॥రా॥
1. హరి బోల్ హర బోల్ హరిహర బోల్
హరిహర స్వరూప శ్రీరామకృష్ణ బోల్
2. శివ బోల్ శక్తి బోల్ శివశక్తి బోల్
శివశక్తి రూప శ్రీరామకృష్ణ బోల్ ॥రా॥
3. త్యాగ స్వరూప శ్రీరామకృష్ణ బోల్
అనుభవ ప్రదాత శ్రీరామకృష్ణ బోల్ ॥రా॥

# 140

దుష్ట శిష్ట రక్ష రామకృష్ణ పాహి మాం
దివ్య జ్ఞానదాత రామకృష్ణ రక్ష మాం
1. సర్వ ధర్మనిలయ రామకృష్ణ పాహిమాం
సకల ద్వంద్వరహిత రామకృష్ణ రక్షమాం
2. పంచ భావనిలయ రామకృష్ణ పాహిమాం
పంచవటీవాస రామకృష్ణ రక్షమాం

3. అజ్ఞానమూలనాశ రామకృష్ణ పాహిమాం
జ్ఞాన సుప్రకాశ రామకృష్ణ రక్షమాం
4. ద్వైతభావ ముదిత రామకృష్ణ....అ పాహిమాం
ద్వైతభావ నిరత రామకృష్ణ రక్షమాం
5. అఖిలలోకవంద్య రామకృష్ణ పాహిమాం
అనుభవావతార రామకృష్ణ రక్షమాం
6. రాగభోగవిముఖ రామకృష్ణ పాహి మాం
త్యాగయోగసుముఖ రామకృష్ణ రక్ష మాం

## 141

శ్రీరామ శ్రీకృష్ణ శ్రీరామకృష్ణా
మాం పాహి మాం పాహి మా రామకృష్ణా
1. ప్రేమ ప్రపూర్ణమా శ్రీరామకృష్ణా
బ్రహ్మ స్వరూపమా మా రామకృష్ణా
2. వివేక ప్రబోధమా శ్రీ..........
విజ్ఞాన కేంద్రమా మా..........
3. శారదారాధ్యమా శ్రీ..........
సుబోధ స్వరూపమా మా..........
4. అద్వైతనిలయమా శ్రీ..........
అద్భుతాదర్శమా మా..........
5. అభేదస్వరూపమా శ్రీ..........
అనుభవానందమా మా..........

6. యోగప్రకాశమా శ్రీ..........
త్యాగావతారమా మా....మా........

# 142

(నామసంకీర్తన)

రామకృష్ణదేవ జై శారదామాయి జై
పరమహంస దేవ జై పవిత్ర మాత జై

1. కమర్పుకూరువాస శ్రీరామకృష్ణ దేవ జై
జయరామ వటీవాసి శారదామాయి జై

2. క్షుదీరామ బాలక శ్రీరామ ..........
రామచంద్ర తనయా శ్రీశారదా..........

3. కాళికా ప్రియ నందన రామ ..........
కాళికావతార మూర్తి శారదా ..........

4. సర్వదేవతాస్వరూప రామ ..........
సర్వదేవిరూపిణి శ్రీశారదా ..........

5. శిష్ట రక్ష, దుష్ట శిక్ష రామ ..........
దుష్ట రక్ష, శిష్ట రక్ష శారదా ..........

6. సాధనావతార శ్రీరామ ..........
సిద్ధస్వరూపిణి శ్రీ శారదా ..........

7. యోగ ఫల సమాధినిష్ఠ రామ ..........
త్యాగ ఫల ప్రశాంతి నిలయ శారదా ..........

8. అనుభవావతార శ్రీరామ ..........
అనుభవ స్వరూపిణి శ్రీశారదా ..........

# 143

(నామసంకీర్తన)

౧. భువనేశ్వరీ సుత బుధజన వందిత
విశ్వనాధసుత పాహి మాం
విశ్వ విజ్ఞాన విదిత తత్త్వయుత
వివేకసంయమి రక్ష మాం

౨. ప్రాచ్య పాశ్చాత్యజ్ఞాన సుశోభిత
విశ్వనాధసుత పాహి మాం
ప్రాచ్య సుజ్ఞాన సార నిమగ్న
వివేకసంయమి రక్ష మాం

౩. వేద విజ్ఞాన ప్రసరణ మూర్తి
విశ్వనాధసుత పాహి మాం
విద్యానాధ, విరాగ సంస్తుత
వివేకసంయమి రక్ష మాం

౪. రామకృష్ణపదసరోజ సేవన
విశ్వనాధసుత పాహి మాం
కామవిజేతా త్యాగసుపూజిత
వివేకసంయమి రక్ష మాం

౫. సర్వ విజ్ఞాన సమరస రూపా
విశ్వనాధసుత పాహి మాం
సకలానుభవ సమన్వయరూపా
వివేకసంయమి రక్షమాం

## 144

మంగళం, మంగళం, మంగళం, జయ
శ్రీరామకృష్ణా మంగళం ॥మం॥

1. కాళికావరపుత్రా గుడు త్రిలోకపూతచరిత్రా
లీల, సమాధి విలోల, సకల సు శీల, గుణజనపాల, గదాధర
2. శారదా చిత్తచోరా యశోద విద్యాధారా
ధీర, వేద విచార సార, గభీర, భవ సంసార సంహార
3. వివేక యతిమణి తేజా నుత వైరాగ్యపూర్ణ సరోజా
సుందర, అరవిందనేత్ర, ముకుంద, అనుభవానంద సాగర

## 145

శారదమ్మకు మంగళం మా శాంతిమాయికి మంగళం
నిర్గుణంబై యేకమై జను నిర్మలాత్మకు మంగళం ॥శా॥

1. శుద్ధమాయా రూపమై సద సద్విశిష్ట ప్రతిభమై
స్వర్ణగర్భుని రూపమై చెలు వారు తల్లికి మంగళం
2. బ్రహ్మ విష్ణు రుద్రమూర్తులు వాణి లక్ష్మి గౌరిశక్తులు
భువనకోటియు దానయై చెలు వొందు తల్లికి మంగళం
3. జీవుడై పరమాత్మయై జీవత్వనాశక మార్గమై
సచ్చిదానందాఖ్యయై, భా సిల్లు తల్లికి మంగళం
4. కాళియై ఖుదిరాంబలై, సత్ గురువు రామకృష్ణుడై
ఎల్ల భక్తుల రూపమై శో భిల్లు తల్లికి మంగళం
5. అనుపమంబై, అగణితంబై, అవ్యయంబై, అద్వయంబై
అనుభవానందంబునై, పర మైన వల్లికి మంగళం

## 146

శ్రీరామకృష్ణా మంగళం గురుమహారాజా మంగళం
మంగళమనుపమ మంగళ గుణనిధీ
మంగళాంగ, సన్మంగళతేజా ॥శ్రీ॥

1. మత్స్య కూర్మ హరి మంగళం వేదసుధాకర మంగళం
మధుర, గౌరి, చంద్ర పద్మ, విష్ణు, గిరిజ
నిత్య, విజయ, కేశవాది భక్తపాల

2. వరాహ, నరహరి మంగళం హిరణ్యభ్రమ హరి మంగళం
వామ, గిరీశ, సురేశ, నాగ, బల
రామ, మహేంద్ర, సురేంద్రపాల గురు

3. వామన, భార్గవ మంగళం కామవినాశక మంగళం
తోతాపురి, జటధారి, బ్రాహ్మణి
సదమల గురువర సద్గురు దేవ

4. రామ, కృష్ణ హరి మంగళం ప్రేమగుణార్ణవ మంగళం
శారద, గోపాల, గౌరి గోలపా,
చంద్ర, జోగి, శ్రితజన పరిపాల

5. బుద్ధ, కల్కి హరి మంగళం పూర్ణ ప్రజ్ఞా మంగళం
నరేన్, రాఖల, హరి, కలి, శారత్,
శారద, గంగా, శశీ, ముకుందా

## 147

మంగళమిదె గైకొనుమా మాయీ శ్రీశారదమ్మా ॥మం॥

1. మంగళకర గుణవిశేష మానిత చరణాబ్జ భూష
 మృదు మధురిమ మంజు భాష ముని మానస సంతోష
2. కర్పూర హారతులను కన్నతల్లి గైకొనవే
 కరుణామృతరస జలధీ శరణాగత జన నవనిధీ
 గురుతర మహిమాన్విత ధీ చారుతర తేజోనిధీ
3. అమదిన మంగళ హారతి అమరాదులు నిడు హారతి
 సకల భూతగణ వాసినీ సర్వభక్త పరిపోషిణీ !
 అఖిల దేవతా స్వరూపిణీ అనుభవానందదామృత వాహినీ

## 148

శ్రీరామకృష్ణదేవ మంగళం జయ మంగళం ॥శ్రీ॥

1. వివేకానంద ప్రముఖ విఖ్యాత శిష్యగణములు
 సేవింప సచ్చిదానంద సేవలో మునుగు దేవ
2. ముఖమున మందహాస ముత్యాల ధారలొలయ
 అభయ హస్తాల జాచెడు సర్వ సంరక్ష దేవ
3. విశ్వమోహనమైన విశ్వవ్యాపకమైన
 భాస్వర జ్ఞానదీప్తుల భాసిల్లునట్టి దేవ
4. వేద విజ్ఞానభాష్య విస్పష్ట ప్రణవగాన
 పరమాత్మ, పరమపురుష పరంధామ, దేవ దేవ
5. బ్రహ్మాది మూర్తులైన భావింపలేని మహిత
 బ్రహ్మాండ సుస్వరూప అనుభవానంద దేవ

## 149

జనని హారతిదిగో శారద జనని....హారతిదిగో ॥జ॥

1. ప్రవిమల శుభ సుందరాంబవు శివ
   ప్రతిభా విభూషితవు శారద
2. దేవదేవిగణ దేవవిభూతుల
   దివ్యముగా ప్రకటించెదు తల్లి వి
   దివ్య నేత్రములు తేజము చల్లగ
   తేచ్చునుగా నీ భక్త సంతతుల
3. సర్వచరాచర సాక్షి రూపిణివి
   సకల జీవులకు మాతృదేవతవు
   సర్వము ప్రేమరసామృత మగ్నము
   సల్పెదు నీ కృప చాలము తెలుపగ
4. అనుభవ సంపదలో క్రీడించుచు
   అనుపమ కాంతుల వ్యాప్తిగాంచుచు
   ఆశ్రిత జనములు ఆనందింపగ
   అతుల విభూతుల నలరెడు మా శ్రీ

## 150

శ్రీ రామకృష్ణునకు రమణీయ గుణునకు
కామదూరునకు కామితునకు.........
కమర్పిపుష్కర నగర క్షుదిచంద్ర సుతునకు
కమనీయగాత్ర ప్రఖ్యాతునకు, మంగళం మంగళం

1. శివపాత్ర ధరునకు శ్రితజనపాలునకు

శ్రీజన ప్రేమైక పూజ్యునకు....
చిత్త సంలగ్న సత్ చిత్సుఖానందునకు
చైతన్యమూర్తి ప్రశాంతునకు మంగళం మంగళం

2. దక్షిణేశ్వరీ కాళీ దర్శనధనునకు
విక్షేపరహిత విశేషునకు....
సాక్షికదృష్టి వినాశక ఘనునకు
నిశ్చలచిత్త విభూషితునకు మంగళం మంగళం

3. శారదానాధునకు స్థిరబుద్ధి యుతునకు
శారదాపూజా విశారదునకు....
దుర్లభ తను ధర్మ దూర విభవునకు
గురుతర సందేశ ధారునకును మంగళం మంగళం

4. అఖిల చరాచర నికరైక ద్రష్టకు
ఆత్మైనాహమానందునకును...
ఆత్మారామునకు అత్యధిక తేజునకు
అనుభవానందునకు అతులునకు మంగళం మంగళం

## 151

శారదేశ్వరీ నీకు హారతులు తల్లీ
సర్వమంగళ నీకు కర్పూర హారతీ ॥శా॥

1. మహిని జీవులకెల్ల మంగళప్రదవీవు
మహిత దేవతలకు మాతృదేవతవీవు
మంగళాంబవు నీవు మా మంగళారతుల
మన్నించి గైకొనుచు మంగళంబీయవే

2, శోభాయమానమై సౌఖ్యసంధానమై
సౌందర్యపాదమై 'సౌరభాతీతమై'
చంద్రికాబహుళమున చెల్వొందు నీకిదే
జయహారతుల నిచ్చి సంతసింతుము దేవి

3. అనుపమానము నీదు అమృతపు ప్రేమంబు
అగణితము సుగుణాలు అద్భుతము నీ శక్తి
అనుభవానందములకాకారమీవమ్మ
హారతుల నందుకొని అందిడవె నీ కరుణ

## 152

మంగళము శ్రీశారదారామకృష్ణాయ
మంగళము శ్రీఖుదీరాముతనయం ...
మంగళము త్రైలోక్య గురుమహారాజాయ
మంగళము భవ ధవ పద్మజాయ
జయ మంగళం నిత్య శుభమంగళం

1. మత్స్య, కచ్ఛప, ఘోణి, మృగరాజ, వామన
రామ, రాఘవ, కృష్ణ, బుద్ధ, కల్కి—
సర్వధర్మోద్ధార సకలలోకాధార
శాశ్వతానందరస సాగరాయ
జయ మంగళం నిత్య శుభమంగళం

2. ప్రాక్ప్రతీచీరూప పూర్వాధునామూర్తి
పారంపరాధ్యాత్మ పుణ్యజలధీ ....
పరమాత్మ, పరమేశ, పరమహంసా, దేవ

పతిత పావన, దివ్య పాదయుగళం
జయమంగళం నిత్య శుభమంగళం

౮. అనుభవానందఘన మణిమయాలంకార
అనుపమానప్రభా భూషితాయ....
అనవద్యచరితాయ అవ్యయానంతాయ
అత్యద్భుతాఖండ మూర్తి శుభదం
జయమంగళం నిత్య శుభ మంగళం

## 153

శారదామణీ మంగళం జయ
శాంత స్వరూపిణీ మంగళం
రామకృష్ణ హృదయాధి దేవతా
కామ వినాశన మోక్షప్రదాతా ॥శా॥

జయరామ వటియందు జనియించి
జగద్ధాత్రికై పరవశించి
జగన్మాతవై ప్రకాశించి
జగన్మంగళవై అమరిన తల్లీ ॥శా॥

శ్యామాతనయవై శారదాంబవై
శాశ్వతానంద దివ్యమూర్తివై
భోగ దూరవై అనుభవ రూపివై
త్యాగమూర్తివై అమరిన తల్లీ ॥శా॥

## 154

జో జో చంద్రకుమారా జో జో పరమావతారా
జో జో జ్ఞానవిహారా జో జో సకలాధారా ॥జో॥

1. అనుభవములను ఉంగరములచే
అమరిన వేదపు గొలుసులు సాగిన
ఆత్మ నాబడు దూలమునకును అమ్మ కాళికా అనే ఊయెలలో
2. ప్రజ్ఞ యనియెడు పరుపుల పైన వైరాగ్యంబను తలగడమీద
భక్తి యనియెడు తెరలోపలను పరమానంద సువాసనలోన
3. శారద, నరేన్, రాఖలులు హరి, కాళీ, శరత్, గంగాధరులు
నిరంజన్, యోగిన్, లాటులు చేరి యూచ సమాధులలోనికి
4. గౌరి, వైష్ణవ కేశవ విజయులు, గోపాల, ఈశ్వర, బలరాములును
గిరీశ నాగ, సురేంద్ర మధురులుమారు మ్రోగగ పాటలు పాడగ
5. జ్ఞాన వరేణ్య సుర కింపురుషులు మునిగణములు భక్తాది మహాత్ములు
అనవరతము నిను సంస్తుతి సేయగ అనుభవజ్ఞానసుధా పానమ్మున

## 155

అమ్మ లాలీ శారద అమ్మ లాలీ....
అఖిలలోకములకు తల్లీ దేవి లాలీ.... ॥అ॥
1. సృష్టి స్థితి లయ కర్మలచే శ్రమల మునిగితే....
సగుణత్వంబుల వీడి తల్లీ శాంతిగాంచవే
2. లోకములలో ప్రత్యక్షంబగు శక్తి రూపివీ....
ఏకైకంబగు లోకాతీతవు బ్రహ్మంబవె నీవు

5. అనుభవానందరసవాహిని అంబ లాలీ...
లాలి శీలావిగ్రహా లాలీ లాలి లాలీ

## 156

లెమ్మా, లెమ్మో, రాజహంసా లెమ్మా రామకృష్ణు గొలువ
కమ్మని మధురమ్ము లొలుక రమ్ము రమ్మని పిల్వ వచ్చె ॥లె॥

1. చేరదీయుచు గరము బట్టుచు నిరతము మన నీడ పగిది
గురుతరంబగు దర్శకుండై పరంధామము చేర్పవచ్చె
2. ముఖమున పద ముత్యాధార ముదమున భవమొందుచున్నది
మురిపెమున నా పుష్పవృష్టిలొ మునిగిన మన ముక్తి సత్యము
3. నిశ్చలంబుగ గొల్చువారల హస్తగతమౌ మోక్ష పదవి
నిశ్చయంబిది విశ్వసింపుము నిద్రలేలనె భద్రపడవే
4. అతని కరుణార్ద్రదృష్టి అతని ప్రేమైక వృష్టి
అనుపమంబిది అద్వితీయము అనుభవానంద ప్రపూర్ణము

## 157

మేలుకో శ్రీరామకృష్ణా మేలుకో భువనైకకృష్ణా
మేలుకో భూతాంతరాత్మా మేలుకొనవయ్యా ॥మేలు॥

1. నీ ముఖారవింద దర్శన కామమున నీ భక్తకోటులు
వేకువంబున మేలుకొలుపుల భక్తితో నర్పింప వచ్చిరి
2. పక్షిగణములు గీతికలతో పశువులును తమ క్షీరములతో
వృక్షములు ఫలపుష్పములతో ప్రేమమయము నిను జూడవచ్చెను

3. భీమునిపుర వరనివాసా పరమపావన గుణవిశేషా
అనుభవానంద ప్రకాశా అఖిలలోకాధార ఈశా

## 158

మేలుకో శారదా మేలుకోవమ్మా
మేలుకొని నీ దరికి చేర్చుకోవమ్మా ॥మే॥

1. శక్తి ప్రదాయినీ శక్తి ప్రసారిణీ
సౌమ్య స్వరూపిణీ మేలుకోవమ్మా ॥మే॥

2. పశుతత్త్వమును బాపి పశుపతిని జేర్చి
మానవత్త్వమును నిలిపి మాధవుని దెలిపి
దైవత్వమును జూపి దివ్యత్వమొసగి
బ్రహ్మ తత్త్వమ్మునిడ మేలుకొనవే ॥మే॥

3. శ్రీ లక్ష్మివై సకల సౌఖ్యములనుంచి
శ్రీ వాణివై అపర విద్యలను నేర్పి
శ్రీ గౌరివై దివ్య అనుభవము నొసగి
త్యాగ స్వరూపివై మేలుకొనవే.... ॥మే॥

## 159

మేలుకో గురుదేవ-మేలుకో నుతభాస
మేలుకో జితభవా-మేలుకొనవే....

1. శ్రీ వాణి శ్రీ లక్ష్మి శ్రీ గౌరి దేవతల
ప్రార్థనల మది గొనుము-మేలుకొనవే

2. యోగనిద్రారూఢ-మగ్న చిత్తుండవై
యున్నచో మము జూడ-నుండు నెవరు
మము నేల సమాధి-మానివేయుచు నీవు
మందహాసముతో మేలుకొనవే

3. నీవు కనుమూయుచో-నిఖిల విశ్వంబులును
నీలోన లయమొందు-నిర్మలాత్మ
మాదు సంస్కారములు-మాప జాగ్రత్తగొని
మోదమును మాకిడగ-మేలుకొనవే

4. నీ మంధహాసముల-నీ మధుర భాషణల
నీ హస్తస్పర్శముల - నిచ్చగించి
నీ కృపారసమెపుడు-వర్షించునో యంచు
నిలుచు భక్తుల జూచి-మేలుగొనవే

5. అత్యంత మాధుర్యమౌ యనుభవానంద
సాగరంబుల నీవు-చనుచునుండ
మేమెట్లు తరియింతుమో స్వామి కృప నుంచి
మాకు మోక్షమ్మిడగ-మేలుకొనవె

## 160

మాధవ కృష్ణా మాధవా
పాలయ మాం శ్రీ ధవా, కృష్ణా ॥మా

1. గోపరిపాలా గోపీలోలా గోపజనావృత మురళీలోలా
2. నందకుమారా నవనీత చోరా హృదయవిహారా అఘ సంహారా
బుధ జన మానస మృదు సంచారా రాధాపూజిత నందకిశోరా
3. పన్నగశయనా పంకజనయనా పాపవిమోచన పూజిత చరణా
యోగవిభూషణ తాపనివారణ త్యాగాభరణా మునిజన శరణా

## 161

త్రిలోచన సాంబ సదాశివ త్రిపురాంతక హర సదాశివా ॥త్రి॥

1. త్రిగుణాతీతా త్రిశూల ధారీ త్రిలోకపాలా సదాశివా
త్ర్యక్షర సన్నుత త్రికాలవేదీ త్రిదోషవారిణి సదాశివా
2. పన్నగభూషణ ప్రమదాదీశ్వర పంచభూతధర సదాశివా
పాపవినాశన పార్వతీరమణ పంచముఖేశ్వర సదాశివా
3. కుమారసన్నుత కుటిలవినాశక కాలకూటధర సదాశివా
కాలనియామక కాల విజేతా కఠిన తపోధన సదాశివా
4. రామార్చిత పద రామనామప్రియ రావణ పూజిత సదాశివా
భవభయనాశన బంధవిమోచన భక్తవశంకర సదాశివా
5. త్యాగప్రియంకర భోగవిదూరా యోగరూపధర సదాశివా
అభిషేకప్రియ ఆనందదాయక అనుభవరూప సదాశివా

## 162

### శ్రీ రామకృష్ణ మంగళాష్టకం

1. ఖుదీరామసుపుత్రాయ చంద్రామణిసుతాయ చ।
శారదారాధ్యదేవాయ రామకృష్ణాయ మంగళం ॥
2. కాళికామృతచరణాబ్జ ఆరాధన తత్పరాయ చ ।
కామక్రోధవినాశాయ రామకృష్ణాయ మంగళం ॥
3. విద్యావివేకవైరాగ్యభక్తిముక్తిప్రదాయ చ ।
విశ్వారాధ్యచరిత్రాయ రామకృష్ణాయ మంగళం ॥
4. కామక్రోధమదోన్మత్త లౌకికోద్ధరణాయ చ ।
కామధేనుస్వరూపాయ రామకృష్ణాయ మంగళం ॥

5. కల్మషదృష్టిసంయుక్త మానవోద్ధరణాయ చ ।
కల్పవృక్ష స్వరూపాయ రామకృష్ణాయ మంగళం ॥

6. సర్వకామ నిరాసాయ లోకశాంతి ప్రదాయ చ ।
సకలానుభవరూపాయ రామకృష్ణాయ మంగళం ॥

7. సర్వదేవస్వరూపాయ సర్వమతసాధకాయ చ ।
సర్వలోకశరణ్యాయ రామకృష్ణాయ మంగళం ॥

8. మంగళం వివేకమునయే శారదామాయై చ మంగళం ।
మంగళమనుభవ రూపాయ రామకృష్ణాయ మంగళం ॥

# 163

## శ్రీ రామకృష్ణాష్టకమ్

1. ఓంకార రూపాయ వినిర్మలాయ ఓంకారవేద్యాయ
అమలాత్మకాయ ।
ఓంకార గమ్యాయ అగోచరాయ శ్రీరామకృష్ణాయ సదానమామి॥

2. నరేంద్ర శ్రేష్ఠాయ నిరంజనాయ సర్వావతారాయ నారాయణాయ।
నరేంద్ర గానామృత తోషితాయ శ్రీ .... .... ....॥

3. మోక్ష స్వరూపాయ మదాంతకాయ మమకారనాశాయ
మందస్మితాయ।
ముముక్షుజన తాప నివారకాయ శ్రీ .... .... ....॥

4. భక్తి ప్రపూర్ణాయ భవనాశకాయ భక్తిస్వరూపాయ భయాపహాయ।
భోగాది విముఖాయ భువనేశ్వరాయ శ్రీ.... .......॥

5. గయాధివాసాయ గదాధరాయ గంభీరవదనాయ గంగాధరాయ।
గర్వాపహారాయ గురుపుంగవాయ శ్రీ .... .... ....॥

6. వరదాయ వంద్యాయ విశ్వాత్మకాయ వివేకయతవర్య సుపూజితాయ।
విజ్ఞానరూపాయ విమోచకాయ శ్రీ .... .... ....॥

7. తేజోనిధానాయ తపోధనాయ త్యాగావతారాయ తత్త్వప్రదాయ।
తమోవినాశాయ త్రిగుణాత్మికాయ శ్రీ .... .... ....॥

8. రాకేందు వదనాయ రామార్చితాయ రాధాస్వరూపాయ
రాగాది శూన్యాయ రమాధవాయ శ్రీ .... .... ....॥

9. మధుర స్వరూపాయ మదనాంతకాయ మాయావిదూరాయ
మానవ మనస్తత్వ సువేదితాయ శ్రీ .... .... ....

10. కృష్ణ స్వరూపాయ కుటిలాంతకాయ కృపాసముద్రాయ
కులదీపకాయ।
కాళీ స్వరూపాయ కఠినాత్మికాయ శ్రీ .... .... ....॥

11. ష్ణాంతర్గత షకార నకారకాయ షడ్దేవతా, షట్చక్ర విశారదాయ।
షడ్వర్గ షడ్భావ వినాశకాయ శ్రీ .... .... ....॥

12. యమాది అష్టాంగ సుశోభితాయ యజ్ఞాదిరహితాయ
యతిప్రియాయ।
యతివర్య తోతాపురి సేవితాయ శ్రీ .... .... ....॥

యః పఠేదేతత్ స్తోత్రం త్యాగీశానంద విరచితం।
త్యాగమూర్తిం రామకృష్ణం పరమహంసం స విందతే॥

# 164

## శ్రీ శారదాష్టకమ్

శ్లో॥ రామకృష్ణ గురుధ్యానతత్పరాం శాంతి దాయినీమ్ ।
కామకాంచనదూరాం తాం శారదాం ప్రణమామ్యహమ్ ॥

2. రామకృష్ణం హృది ధ్యాత్వా మాతేతి గురుదేవతా।
పూజితాం తాం త్రిరూపేణ శారదాం ప్రణమామ్యహమ్॥

3. పూజితాం రామకృష్ణేన సర్వలోకైర్నమస్కృతామ్ ।
వందితాం భక్తబృందైశ్చ శారదాం ప్రణమామ్యహమ్ ॥

4. ముఖర్జీవంశ సంజాతాం ప్రసన్నగుణ శోభితామ్ ।
నిత్యానందమయీం దేవీం శారదాం ప్రణమామ్యహమ్॥

5. జయరామ వటీవాసాం సర్వేషాం చ ప్రియం కరీమ్।
క్షమాది గుణసంపన్నాం శారదాం ప్రణమామ్యహమ్॥

6. సర్వమంగళ సంపన్నాం సర్వానంద ప్రదాయినీమ్ ।
ప్రసన్నవదనాం దేవీం శారదాం ప్రణమామ్యహమ్ ॥

7. సమాధి నిష్ఠాగరిష్ఠాం చ దివ్యానంద నివాసినీం ।
స్వస్వరూపస్థితాం దేవీం శారదాం ప్రణమామ్యహమ్॥

8. సర్వదేవీ స్వరూపాం తాం సర్వవిద్యా స్వరూపిణీమ్ ।
సకలానుభవ సంపన్నాం శారదాం ప్రణమామ్యహమ్ ॥

9. అలౌకిక ప్రేమదాం దేవీం అవ్యయానంద రూపిణీమ్ ।
ఆజన్మబ్రహ్మ నిష్ఠాం తాం శారదాం ప్రణమామ్యహమ్ ॥

10. త్రిగుణాతీతం త్రికాలజ్ఞాం త్రిజగత్కల్యాణదాయినీమ్ ।
తాపత్రయనాశినీం దేవీం శారదాం ప్రణమామ్యహమ్ ॥

11. సాధకానాం సిద్ధమూర్తిం చ దేవతానాం దివ్య రూపిణీమ్ ।
శిష్యాణాం మాతృమూర్తిం చ శారదాం ప్రణమామ్యహమ్ ॥

21. త్యాగస్వరూపిణీం దేవీం త్యాగయోగ సమన్వయీమ్ ।
శోకమోహవిదూరస్థాం శారదాం ప్రణమామ్యహమ్ ॥

హరిః ఓం తత్ సత్



స్థాపితము : 1952

# శ్రీ అనుభవానంద గ్రంథమాల

బాపట్ల—522 101, గుంటూరు జిల్లా.
భీమునిపట్నము-531 163 విశాఖ జిల్లా.

ఉద్దేశ్యము : ఈ గ్రంథమాలలో శ్రీ అనుభవానంద స్వాములవారి, శ్రీమాతాజీ త్యాగీశానందులవారి మరియు యితరులచేతను రచితములైన భక్తి జ్ఞాన వైరాగ్య ప్రబోధక గ్రంథములు ప్రకటింపబడును.

విధానము : సంవత్సరమున మొత్తమునకు రెండువందల పుటలు గల గ్రంథములు వెలువడుచుండును.

విరాళము : 1) రు. 1116/-మించు విరాళమొసంగువారు మహారాజపోష కులు. వీరి ఫోటో ఒక ముఖ్యగ్రంథమున ప్రకటింపబడును.
2) రు. 516/- మించు విరాళమొసంగువారు రాజ పోష కులు. (సంవత్సరమున 10 వాయిదాలలో పైకము చెల్లింప వచ్చును.) గ్రంథమాల పుస్తకములన్నియు వీరు ఉచి తముగా బడయుదురు.

గ్రంథమాల మహోద్యమమునకు ఎల్లరు ఉచితరీతిని దోడ్పడుదురుగాక !

* వి పి ద్వారా పుస్తకములు కోరువారు పుస్తకముల ఖరీదుపైకము ముందుగాపంపవలెను.

**పోస్టేజీ, ప్యాకింగ్ చార్జీలు ప్రత్యేకము.

# సమన్వయానుభవానందము

శ్రీ స్వామీజీ గొప్ప మహనీయులు. వారు దేవునికై ఎంత ఆవేదన చెందారో తెలియజేస్తాయి వారి 'శ్రీ రామకృష్ణాంజలి' 'శ్రీ దక్షిణేశ్వరీస్తవము'లు. ఈ రెండింటిని శ్రీ స్వామీజీ తమ కళాశాలా విద్యాభ్యాస సమయంలోనే వ్రాసుకున్నారు. సాధనలో మనస్సే ముఖ్యం కాబట్టి లోకంపోకడను మనస్సుకు తెలియజేస్తుంది 'చిత్తప్రబోధ'. ఆ సాధన లోకం నుండి ప్రారంభమై శాస్త్రంతో పూర్తి అని చెప్పుతుంది, 'సాధన సుధ'. ఆ సాధన సమాధివరకు చేయాలని బోధిస్తుంది. 'సాధన రహస్యం'. ఆ సాధనానుభవమే 'అనుభానందం'. ఆ అనుభవానందాన్ని పొందినవాడు లోకంలో సర్వం తెలిసి మెలుగుతాడు అని 'సాధన మకరందం' చెప్పుతుంది. ఆ అనుభవం కలిగితే సర్వ సిద్ధాంత సమన్వయం కరతలామలకం అంటుంది. 'సర్వ సిద్ధాంత సౌరభం'. ఆ సర్వం అంటే సాధన నుండి సిద్ధత్వం వరకు నాలోనే ఉన్నవి అంటుంది 'మాండూక్య రసాయనం'. ఈ పై సాధనానుభవములన్ని 'శ్రీ రామకృష్ణ, శారదా, వివేకానందాదర్శము' లలో గ్రహించి సిద్ధత్వమును పొంది 'శాంతి సామ్రాజ్యా' న్ని పొందుతాడు.